# అభ్యుదయ

నవంబరు 1977

60 పైసలు



విప్లవోదయం

'విప్లవ రక్షణకు' అన్న యీ చిత్ర రచయిత పావెల్ బునిన్

తప్పక చూడండి



అన్నపూర్ణా వారి

# ప్రేమలేఖలు

సులోచనారాణి నవల

నిర్మాత
దుక్కిపాటి మధుసూదనరావు బి.ఏ.

దర్శకుడు
కె. రాఘవేంద్రరావు బి.ఏ.

నవయుగ

తప్పక చూడండి

ఉదయభాస్కర్ ఇంటర్నేషనల్

# మృగయా

హిందీ వర్ణ చిత్రం

976 సంవత్సరం ఉత్తమ చిత్రంగా
ారత ప్రభుత్వ 'స్వర్ణకమలం'
ుహుమతి గెలుచుకున్న చిత్రం!
ప్రవేశ రుసుము రూపాయి అంతకు లోపు మాత్రమే!

దర్శకత్వం:
మృణాల్ సేన్

నవయుగ



ఆంధ్ర ప్రదేశ్
అభ్యుదయ
రచయితల సంఘ
మద్రాసు శాఖ

# అభ్యుదయ

15 అరులమ్మాల్
వీధి,
త్యాగరాయనగర్,
మద్రాస్-17

సంచిక 4, సంపుటి 1, నవంబర్ 1977, విడిప్రతి 60 పైసలు, సాలు చందా రూ. 7

## షష్టిపూర్తి

అరవయ్యేళ్ళు మనిషి జీవితంలో పెద్ద వయస్సవుతుంది గాని, ఒక దేశానికయితే అది పెద్ద వయస్సేమీ కాదు. పెరుగుదల, దార్ఢ్యం, జ్ఞానం మొదలైనవి లక్షలూ, కోట్లూ మనుషులున్న దేశానికి రావడానికి దశాబ్దాలు కాదు, శతాబ్దాలే అవసర మవుతాయి. ఇది అరవయ్యేళ్ళ క్రితంవరకూ వున్న అనుభవం, చరిత్ర.

అయితే అరవయ్యేళ్ళ కిందట ఒక కొత్త తీరులో పుట్టి, ఒక కొత్త తెన్నును అనుసరిస్తోన్న సోవియట్ దేశానికి, గత ముప్ఫయ్యేళ్ళలో ఆవిర్భవించిన పది-పదిహేను యితర సోషలిస్టు దేశాలకూ యిది వర్తించదు.

అంచేత దేశ సర్వతోముఖాభివృద్ధికి అరవయ్యేళ్ళు అతి స్వల్పకాలమే అయినా కొత్త జవంతోనూ, కొత్త తేజంతోనూ సోవియట్ దేశం ముందుకు సాగుతూ వుంది, ఆదర్శజ్యోతిగా వెలిగిపోతూ వుంది. తక్కిన సోషలిస్టు దేశాలు దానిని అనుసరిస్తున్నాయి.

ఇంతకు ముందర పెద్ద విప్లవాలుగా పేరుకెక్కిన ఫ్రెంచి విప్లవం, అమెరికన్ స్వాతంత్ర్య సమరం కొన్ని సదుద్దేశాలతోనూ, ఉన్నత భావాలతోనూ ప్రపంచాన్ని కొంత కాలం ఉత్తేజపర్చినా, మూల సమస్యల్ని, అంటే సర్వప్రజల అత్యవసర జీవిత సమస్యల్ని తీర్చలేకపోవడంవల్ల అవి విఫలమయ్యాయి. శాస్త్రీయమైన ప్రాతిపదిక లేకపోవడం, స్వీయ రక్షణకు కట్టుదిట్టమైన వ్యవస్థ లేకపోవడం, సాంఘిక దురన్యాయాన్ని నిరాటంకంగా సాగించే వర్గాల చెప్పుచేతల్లోకి తాము పోవడం యిటువంటి విప్లవాలు విఫలం కావడానికి కారణాలు.

శ్రమ ఫలితాన్ని, శ్రమించి సంపదలను సృష్టించేవాళ్లు కాకుండా, పైనుంచి రాబందులు తన్నుకపోయే రాజ్యాన్ని అంతం చెయ్యనిదే సాంఘిక న్యాయాన్ని స్థాపించడం సాధ్యం కాదని మార్క్సు, ఎంగెల్సు నిరూపించారు; లెనిన్ ఆచరణలో సాధించి చూపించారు. వారి ప్రబోధాలను, ఆచరణనూ అనుసరించిన సోవియట్ దేశం తన దేశ ప్రజలందరి అవసరాలన్నిట్నీ తీర్చడమే కాకుండా, వారికి సర్వసౌఖ్యాలూ అందుబాటులోకి తీసుకరా గలుగుతోంది. దాని అడుగు జాడలలో పోతోన్న అనేక సోషలిస్టు దేశాల ప్రజలతోబాటుగా ప్రపంచంలోని మూడో వంతు జనాభా సుఖశాంతులు అనుభవిస్తున్నది. మిగతా దేశాలు యీ ఆదర్శ సాధనకోసం పాటుపడుతున్నవి. అందుకే యీ తొలి మార్గదర్శి అయిన సోవియట్ దేశం పుట్టిన రోజు, సర్వప్రపంచ ప్రజలకు పండగ

రోజయ్యింది. నవంబరు నెల 7 న దాని షష్ఠిపూర్తి ఉత్సవం జరగబోతున్నది.

వంచనతో, కపటంతో, యివి పీలుకాకుంటే దౌర్జన్యంతో బలహీన దేశాలను శతాబ్దాలుగా దోచుకొంటూ ధనిక దేశాలవడం మూలంగా అగ్రరాజ్యాలైనవి, తమ లక్షలు, కోట్ల మంది ప్రజలను నిరక్షరాస్యులుగా, నిరుద్యోగులుగా చేసి, అది చాలక వారిని పతితులుగానూ, భ్రష్టులుగానూ చేస్తున్నాయి; తమ దేశాలలోని అల్పసంఖ్య ప్రజల్ని నిత్యదరిద్రులుగానూ, బానిసలుగానూ అణచిపెట్టి వుంచుతున్నాయి. ఇతర దేశాలను కుట్రలతోనూ, కూహకాలతోనూ తమ ప్రాబల్యం కిందికి తెచ్చుకోవడం, సర్వ వినాశనం తెచ్చిపెట్టగల యుద్ధాన్ని రగల్చడానికి అనునిత్యం ప్రయత్నించడమూ అవి చేసే ఘోర దురంతాలలో కొన్ని.

ఇందుకు పూర్తిగా భిన్నమైన సోవియట్ దేశంలోని పరిస్థితి, ఆ రాజ్యాంగ యంత్రం ఆధిక్యతను చూపుతుంది. దాని అరవయ్యేళ్ళ మనుగడలో చాలా దశాబ్దాలుగా ఆ దేశంలో నిరక్షరాస్యత, నిరుద్యోగం లేవు. ఆ దేశంలో ఉచిత విద్య, ఉచిత వైద్యం, పనికి, విశ్రాంతికి హామీ, అభ్యుదయ కాముకమైన దేశంలో వుండవలసిన సకల స్వేచ్ఛలూ కలలు కావు, రాజ్యాంగ చట్టంలో వుండే వాగాడంబరాలు కావు— అవి నూటికి నూరుపాళ్ళు వాస్తవాలు, దాని శత్రువులు సైతం కాదనలేక పోతోన్న సత్యాలు. ఉత్పత్తి అయ్యే సంపదల్ని జలగలు పీల్చుకోవడమో, గద్దలు తన్నుక పోవడమో అక్కడ జరగదు కాబట్టి, ఆ సంపదలు సర్వప్రజల సౌఖ్యం కోసం, శ్రేయస్సు కోసం వినియోగింపబడుతున్నాయి.

అనేక ముఖ్య పారిశ్రామికాది ఉత్పత్తులలో, ప్రపంచ మంతట్లో ప్రథమ స్థానం దానిదే. సర్వ ప్రపంచ శాస్త్రజ్ఞుల సంఖ్యలో 25 శాతం వున్న దేశం సోవియట్ దేశం. సోషలిస్టు సిద్ధాంత బలంవల్ల, వందల సంవత్సరాలుగా దోపిడీ విధానం అధికారం చెలాయిస్తోన్న దేశాలకు సాధ్యపడని సౌఖ్యాన్ని, శాంతినీ—రెండు ప్రపంచ యుద్ధాలలో, ఒక అంతర్యుద్ధంలో అపరిమితమైన నష్టాలు అనుభవించినప్పటికీ, తన ప్రజలకు లభింప జేసింది, సోవియట్ దేశం.

విచ్చిన గులాబీ తోటల్లా శ్రామికుల పిల్లలు నిండివున్న క్లాసు గదులూ; మైళ్ళకు మైళ్ళు నల్లసముద్ర తీరంలో వేలు లక్షలమంది కార్మిక కర్షక స్త్రీ పురుషులు ధనిక దేశాల్లోని రాజులు, కోటీశ్వరులూ మాత్రం అనుభవించే తీరుబడి వినోదాలూ; కార్లు, టెలివిజన్ సెట్లు, రేడియోలు నిత్యావసర వస్తువులుగా వాడుక చేసుకొనే సామాన్యప్రజలూ; ఖరీదైన దుస్తులు, రిస్టు వాచీలతో గుర్రాలెక్కి కొండల్లో పశువులను తోలుకెళ్ళే పశువుల కాపర్లూ; ఉద్గ్రంథాలు చదివే టాక్సీ డ్రైవర్లూ....యిటువంటివి, మనకు అబ్బురాలనిపించే దృశ్యాలను ఎన్నిటినో సోవియట్ ప్రజలకు మిత్రులు కాని వారు సైతం చూసి చెప్పినవి.

ప్రస్తుతం సోవియట్ దేశంలో పర్యటిస్తూన్న భారత ప్రధాని, ఆ దేశం మన దేశానికి చేసిన మేలును ప్రస్తావించి, దాని షష్ఠిపూర్తి ఉత్సవ సందర్భంగా, అక్టోబరు విప్లవానంతరం పెద్ద కష్టనష్టాలను భరించి, మహత్తర త్యాగాలుచేసి సోవియట్ దేశం సాధించిన విజయాలకు సమర్పించిన అభినందనలు, మన హృదయ కుహరాలలోని ప్రతిధ్వనులని చెప్పతగ్గవి.

# దీవనలుగా పరిణమించిన శాపాలు

**అక్టోబరు మహావిప్లవం జయప్రదమై రష్యా శ్రామిక ప్రజలు తమ ప్రభుత్వాన్ని స్థాపించు కోవడంతో, సామ్రాజ్యవాదులు, వారి చెప్పుచేతల్లోని పత్రికలు, అధిపతులూ, యీ తరహా ప్రబుద్ధులు కొందరూ గంగ వెర్రులెత్తి పుష్కలంగా శాపాలు కురిపించారు; అది అంతరించక తప్పదని జోశ్యాలు చెప్పారు; యింకా దాన్ని గురించి దుష్ప్రచారం సాగిస్తూనే వున్నారు.**

*న్యూయార్క్ టైమ్స్* పత్రిక 1917 నవంబరు-1919 నవంబరు మధ్యకాలంలో, సోవియట్ ప్రభుత్వం అంతరించక తప్పదని 91 సార్లు జోస్యం చెప్పింది. వాటిలో రెండుసార్లు లెనిన్ రాజీనామా చేశారనీ, నాలుగుసార్లు ఆయనను జైల్లో పెట్టారనీ ప్రకటించింది. ఈ పత్రికే "పంచవర్ష పారిశ్రామిక ప్రణాళిక నిజానికి ప్రణాళిక కాదు, అదొక ఊహాగానం" అని ఉద్ఘాటించింది.

బ్రిటిష్ పత్రిక *డైలీ మెయిల్* 1917 నవంబరు 9న, బోల్షివిక్కుల మీద పెద్దగా ఆశలు పెట్టుకోవలసిన పనిలేదనీ, సోవియట్ ప్రభుత్వం నిలవదొక్కుకో లేదనీ చాటింది.

జపాన్ పత్రిక *కోకుమిన్ షింబున్*: "తీవ్రవాదుల మురా ప్రభుత్వం ఒక భ్రమ తప్పితే యింకేమీ కాదు. రేపు అంతరించి పోవడానికే యిప్పుడది వుంది"

ఫ్రెంచి పత్రిక *లె మాతిన్*: "కొద్ది రోజులయ్యాక, పూర్వపు మంత్రులు యిప్పుడుంటోన్న జైళ్ళకు లెనిన్, ఆయన స్నేహితులూ వెళ్తారు."

జర్మన్ పత్రిక *డై నెయు జైత్*: "రష్యా మీద బోల్షివిక్కుల ఆధిపత్యం అవసాన దశ కొస్తోంది."

పత్రికలే కాదు, కొందరు ప్రబుద్ధులూ శాపాలు పెట్టారు, జోస్యాలు చెప్పారు. జర్మన్ సోషల్-డెమొక్రట్ల నాయకుడు *కార్ల్ కాట్స్కీ* 1918 లో చెప్పిన జోస్యం: "సోవియట్ ప్రభుత్వం ఎంతో కాలం నిలిచేది కాదు, కొద్దిరోజుల్లో అది కూలిపోక తప్పదు."

బ్రిటిష్ భారీ నూనె వ్యాపారి *సర్ హెన్రీ డెటెర్డింగ్*, తాము నాశనం చెయ్యడానికి మాత్రమే పుట్టా మనుకొంటూ వుండడంవల్ల బోల్షివిక్కులు దేనిని సృష్టి చేయడానికీ ఎంత మాత్రమూ సమర్థత లేనివారని ప్రకటిస్తే: అమెరికన్ ఆర్థిక శాస్త్రవేత్త *ఇ. ఎం. ఫ్రయిడ్మన్* 'పరిణామంలో రష్యా'లో "కొద్ది కాలంలోనే ఒక దేశంలో సోషలిజాన్ని స్థాపించవచ్చు నన్న తీపి కథ వమ్మవుతుం" దనీ, "సోవియట్ సమాజం అంతర్యుద్ధంలో పడుతుం"దనీ రాశాడు.

ఈ శాపాల, జోస్యాల పరంపర సోవియట్ పంచవర్ష ప్రణాళికల పైనీ, రెండో ప్రపంచ యుద్ధంలో సోవియట్ ప్రజల మహత్తర పోరాటం పైని కూడా సాగింది. *ఎకానోమిస్ట్* అన్న బ్రిటిష్ పత్రిక 1921 ఏప్రిల్‌లో, సోవియట్ బడ్జెట్, సోవియట్ దేశం దివాలా తీస్తుందనడానికి సాక్ష్యంగా వుందని రాసింది. లండన్ టైమ్స్ అతి అనుకూల పరిస్థితుల్లో సైతం 50 ఏళ్ళు అవసరమయ్యేదాన్ని బోల్షివిక్కులు ఐదేళ్ళలో సాధించడానికి ప్రయత్నిస్తున్నారని ఆశ్చర్యపడింది. సోవియట్ దేశంపైని హిట్లర్ దాడి గురించి, *అసోసియేటెడ్ ప్రెస్* జర్మనీ ఒక నెల లోగా జయిస్తుందని జోస్యం చెపితే, *అమెరికన్* నాజీల మెరుపు దాడి నుంచి రష్యాను అమెరికా బ్రిటన్లు కాపాడలేక పోతున్నాయని మొసలి కన్నీళ్ళు కార్చింది. *న్యూయార్క్ టైమ్స్* 1941 ఆగస్టు 18: "రెడ్ ఆర్మీని హిట్లర్ హతమార్చుతాడు. సోవియట్ ప్రజలు ఆక్రమణదారులకు స్వాగతం చెప్తారు. సోవియట్ ప్రజ తమ ఆయుధాలను సోవియట్ ప్రభుత్వ నాయకుల మీద గురిపెడతారు."

అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ ఆధ్వర్యాన అక్టోబరు 2న పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జరిగిన సాహిత్య గోష్ఠిలో, విశాలాంధ్ర ప్రచురణాలయం యీ మధ్య నడిపిన నవలల పోటీలో బహుమతులు పొందిన మూడు నవలలు సమీక్షించబడ్డాయి.

# బహుమతి పొందిన మూడు నవలలు

శ్రీ సెట్టి ఈశ్వరరావు నవలల పోటీకై విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రకటించిన ఇతివృత్తాన్ని వివరించి, సంగ్రహంగా మూడు నవలలలోని కథా వస్తువును గురించి చెప్పిన తరువాత, ప్రథమ బహుమతి పొందిన "దేవుళ్ళారా! మీ పేరేమిటి," నవలను వ్రాసిన శ్రీకాంత్ తమ రచనా రీతిని వివరిస్తూ "నా నవలలోని పాత్రలేవీ ఉదాత్తమైనవీ, ఆదర్శ ప్రపూరితమైనవీ కావు, ఎన్నేళ్ళుగానో నా మనసు తొలిచివేస్తూ, నీడలా నన్ను వెంబడిస్తున్న కొన్ని సంఘటనలకు, కొన్ని పాత్రలకు సజీవాకృతి కల్పించడానికి ప్రయత్నించాను" అని చెప్పారు. శ్రీ చామర్తి దుర్గాప్రసాద్ (ఐ ఐ టి. లెక్చరరు) విమర్శావ్యాసంతో గోష్ఠి ప్రారంభ మయింది. మొదట "దేవుళ్ళారా మీ పేరేమిటి?" నవలలోని కథను చెప్పి, దీనిని "గ్రామీణ భాషకి దగ్గరగా వున్న 'కలోక్వియల్' తెలుగులో ఆవిష్కరించారు. అయితే సన్నివేశాలకు తగ్గ శైలీ బలాన్నీ, వైవిధ్యాన్నీ ఆయన ఆ భాషలో తేలేక పోయారు" అన్నారు.

నవల చదవగానే మనకు అనిపించేది మర్రిపాలెం గ్రామ సమస్యలు వ్యక్తిగత కక్షల వల్ల పరాకాష్ఠకు చేరినట్లనిపిస్తుందే గాని, ఆర్థిక వ్యత్యాసాల కారణం బలంగా అతకదు. రచయిత ఘటనల్ని జరుగుతున్నవి జరుగుతున్నట్లు కథా కథన పద్ధతిలో చెప్పేరు. తేటతెల్లంగా స్పష్టంగా, వాచ్యంగా చెప్పే పద్ధతిని ఎన్నుకున్నారు. కోర్టులు నడుస్తున్న విధానం, మంచి వాళ్ళని కూడా తెగింపుకు తోసే వాటి జాప్యంమీద బలమైన విమర్శ వుందీ నవల్లో. న్యాయం జనానికి అందడంలో వున్న అవకతవకల్ని రచయిత చూపించారు అని శ్రీ దుర్గాప్రసాద్ ('') అన్నారు.

తరువాత నవలలోని పాత్రలను, ఘటనలను విశ్లేషిస్తూ "నవల ఎత్తుకోవడంలో రచయిత చూపిన శ్రద్ధ, ప్రతిభ, పాఠకులలో కలిగించే ఉత్కంఠ అసాధారణమైనవి. అవసరమైనంత వరకే చెప్పడం, కావలసిన విషయాన్ని సూచించడం, వ్యంగ్యం, ప్రకృతి దృశ్య చిత్రణ రచయిత శక్తికి నిదర్శనాలు. అయితే విస్తృతమైన కాన్వాస్ తీసుకొని అతి చిన్నదైన చిత్రం మాత్రమే ప్రదర్శించి నందున ఒక గొప్ప మంచి నవల రాకుండా పోయిందే అని విచారిస్తున్నాను" అన్నారు.

డాక్టర్ పరుచూరి రాజారామ్ 'వీళ్ళూ మనుషులే' సమీక్షిస్తూ, మనస్తత్వ నవలగానూ, రాజకీయ నవలగానూ దీనిని అనుకోవచ్చు. మనస్తత్వ విశ్లేషణలో—జీవితంలో డబ్బు కీలక పాత్ర వహిస్తుందన్న సత్యాన్ని రచయిత చెప్పదలచు కొన్నారు

అని చెప్పి, నవలలోని ఘటనలనూ, పాత్రలనూ సవివరంగా విశ్లేషిస్తూ, "పాత్ర లన్నిటినీ సహజంగానే రచయిత చిత్రించారు. అయితే మిగిలిన వాటిని అంత సహజంగా నిర్మల్, అనిల్‌లు చిత్రించ బడలేదు. రచయిత అనిల్‌లో ఐక్యం అయారు. ఈ రెండు పాత్రలూ నవలని రాజకీయ నవలగా చేశాయి. 'నారాయణరావు', 'వేయి పడగలు', 'గోరా'లలోని పద్ధతిన రచయిత తమ భావాలను ఉపన్యసించారు. అవయినా కళాత్మకమైన ఉపన్యాసాల స్థాయికి ఎదగలేదు" అని అన్నారు.

"కౌసల్య, శేఖర్‌ల వికృతమైన జీవితం మూలంగానే నిర్మల్ నక్సలైట్ అయినట్లు చూపడానికి ప్రయత్నించారు. నిర్మల్ చనిపోయిన వార్త చదివే సమయంలో అనిల్ పేదలకి సేవ చేస్తుంటాడు. ఆ రకంగా వ్యక్తిగతంగా సేవ చేయడం, నక్సలిజం లోని ఆత్మత్యాగం కన్న అత్యుత్తమం అనే భావాన్ని రచయిత ప్రదర్శించారు.

"అనిల్ పాత్రకి, కథకి సంబంధం లేదు. అనిల్, నిర్మల్ పాత్రల కథా, అసలు కథా వేరు. నిర్మల్ నక్సలైట్ కావడానికి వాళ్ళ యింటి వాతావరణమే కారణం అనడం రెండు కథలకే వున్న ముడి. అనిల్-నిర్మల్‌ల కథ మినహాయిస్తే నాకీ నవల మంచిదిగా కనిపిస్తూంది. మనుషుల్లో బలహీనతల్ని సానుభూతితో చూసేరు రచయిత. అయితే ఆ జనం ఇప్పటి సమాజానికి సరియైన ప్రతినిధులా? వీళ్ళ చిత్రణ అంత అవసరమా?—అది వేరే మాట."

తరువాత శ్రీ కాశీ విశ్వనాథ్ "కన్నీటికి నోరొచ్చింది"లోని కథనూ, పాత్ర లనూ వివరించినాక, "రచయితకి చమత్కారంతో కూడిన, వ్యంగ స్ఫోరకమైన శైలి ఉంది. ఆ శైలి చాలా బలమైనది" అని శ్రీ దుర్గాప్రసాద్ అన్నారు. ఏ పాత్రా మాట్లా డదు, ఉపన్యాసాలిస్తుంది. అవి విడిగా చదవడానికి బాగానే వున్నాయి. కాని కళాత్మక మైన ఉపన్యాసాలు కలబోస్తే నవల కాదు గదా!

"కథను గురించి ప్రత్యేకించి చెప్పవలసింది లేదు. ఎన్నో సార్లు ఎందరో రాసిన కథ. అయితే పోతన్న పాత్ర నిర్వహణలో చక్కటి, ఆరోగ్యకరమైన విధానం వుంది. నవల్లో ఉన్న ముఖ్యమైన విషయం, దొరకి ఎదురు తిరిగి పోతన్న తరపున పల్లెగ్గా సాక్ష్యం ఇవ్వడానికి సిద్ధమైన కిష్టాయి, బిస్కట్ల చిదంబరం వంటి బడుగు జనం కనబరచిన ధైర్యం. ఇది నవల్లో కనబడే ఆశావాదానికి వుదాహరణ".

తమ ప్రసంగాన్ని ముగిస్తూ—శ్రీకాంత్, కాశీ విశ్వనాథ్‌గారి నవలలు హింసను సమర్థించకుండానే, ఆ మాదిరి చర్యలు విఫలంకాక తప్పదంటూనే వ్యవస్థ ఇల్లా ఉన్నంత కాలం హింసా చర్యలు జరుగుతాయని సూచిస్తున్నాయి. మార్గాంతరం, వ్యవస్థ మార్పే అని చెబుతున్నాయి. ఇది సమత్వంతో కూడిన ముగింపు. ఈ బేలన్సు రాజా రామ్ గారి నవలలో లేదు. కౌసల్య, శేఖర్; ఒక రకంగా నిర్మల్ ఆత్మహత్య వ్యవస్థను మార్చే ప్రయత్నంగా కాదు. తమ తప్పిదాన్ని భరించలేక మాత్రమే. అనిల్ సూచించే విధానమే శరణ్యం అనడం రాజారాం గారి వుద్దేశం అయితే, అది నేను అర్థం చేసు కొన్న పద్ధతి ఆశావాదాన్ని ప్రకటించే ముగింపు కాదు—అని శ్రీ దుర్గాప్రసాద్ చెప్పారు.

ఈ మూడు నవలలూ మామూలుగా వస్తున్నవాటి వంటివి కావు. ధనస్వామ్య వ్యవస్థ

లోని కుళ్ళును బహిర్గతం చేసేవి. కళాత్మకంగా చెప్పాలని ప్రయత్నించినవీను. శ్రీకాంత్ గారి పాత్రోచితమైన యాసతో కూడిన శైలి, కాశీనాథ్‌గారి ఝరీ వేగంతో కూడిన బలమైన శైలి, రాజారామ్ గారి వైవిధ్యంతో కూడిన శైలి ఈ నవలలకు కళాత్మకత నిస్తున్నాయి.

శ్రీ ధవళ సత్యం తన ప్రసంగ వ్యాసంలో "దేవుళ్ళారా! మీ పేరేమిటి?" పైని ఈ రచన దేవుడి మాన్యం ఎవరిది—అన్న ప్రశ్నపై సాగిందన్నారు. నవల లోని కథనూ, పాత్రలనూ, వివిధ ఘటనలనూ సవివరంగా సమీక్షించి, చివరికి— ''దేవుడి మాన్యం ఎవరిదన్న ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. నినాదాల రూపంలో కాకుండా వాస్తవికతతో సమస్యకు నవలా రూపం ఇవ్వడంలో శ్రీ శ్రీకాంత్ విజయం సాధించేరు. పాత సమాజంలో కొత్త సమాజ బీజాలు మొలకెత్తాలని, పాత సమాజ పరిస్థితులతో పాటు పాత భావాలు కూడా క్షీణించాలని కోరుతున్న ఈ నవల నవ సమాజ స్థాపనకు జరిగే పోరాటంలో ఒక భాగమే'' నన్నారు.

శ్రీ పసుపులేటి రామారావు కూడ ''దేవుళ్ళారా! మీ పేరేమిటి?'' ఒక్క దానినే తాము చదివామంటూ, దీనితో తమకు రెండు ముఖ్యమైన అంశాలు కనిపించే యన్నారు—''దీనిలోని పాత్రలన్నీ మనం నిత్యం చూసే సామాన్యులు; ఆదర్శ ప్రాయులూ, నీతి బోధకులూ, సకల సద్గుణ సంపన్నులూ అయిన ఉదాత్త వ్యక్తులు కారు. నవల నాటకీయంగా నడుస్తుంది. కథారూపం కనబడని సంఘటనల మాల యిది. నెల్లూరు మాండలిక భాషలో నడిచి ఇది ఒక అదనపు అందాన్ని సమకూర్చుకుంది''— అన్నారు.

తరవాత శ్రీ మహీధర రామమోహనరావు తమ వ్యాసం చదివేరు.

''ఈ మూడు నవలలలోనూ మన తెలుగు దేశపు సామాజిక వ్యవస్థయొక్క అనంత ముఖాలలో మూడు ముఖాలను చూస్తున్నాం. స్వాతంత్ర్యం వచ్చేక, మన గ్రామ ప్రాంతాలలో బలపడిన కొత్త ధనిక భూస్వాముల దుర్నయాలు, గత్యంతరంలేని దశకు నెట్టి వేయబడి, బ్రతుకు కోసం ప్రతిఘటనకు దిగిన సామాన్య ప్రజల మధ్య సాగుతున్న ఘర్షణల గాథ శ్రీకాంత్ నవలకు వస్తువు. కాని వెంకయ్యపాత్రను నవలకు కేంద్ర కంగా చేయడం చేత ఆస్థి సంబంధాలు, వాటి వెనుక నున్న ప్రభుత్వ యంత్రాంగాలు ప్రస్తుత సామాజిక అవ్యవస్థకు మూలం అన్న వాస్తవం మరుగునపడి, గ్రామాలలోని ద్వేషాలూ, కొట్లాటలూ, వెంకయ్య వంటి కోర్టు పక్షుల దురాలోచన ఫలితాలన్నట్లు గ్రామ సమస్య పోజ్ అయింది. ఇది నవలలోని లోపం అంటాను.

''నవలను ముగింపు చేసిన విధం మరీ పెద్ద తప్పుగా వుందనుకొంటున్నా. వెంకయ్యకు కోర్టు శిక్ష విధించిన పద్ధతిలో, దుర్మార్గులు తమ దుష్కృత్యాలకు శిక్ష ననుభవిస్తారనే సాంప్రదాయక సంతృప్తికి రచయిత ప్రాణం పోశారు. నవలలో వెంకయ్య ప్రధాన పాత్రగా రూపొందడం దృష్టి వైవిధ్యాన్ని తెలుపుతుందే గాని, ఈ ముగింపు నవల 'క్రెడిబిలిటీ'నే నష్ట పరుస్తుంది.

''నెల్లూరు జిల్లా కుగ్రామాల జీవితం, సాధారణ ప్రజల అమాయకత్వం, మూర్ఖత్వం, నిర్లిప్తత, సహృదయత్వం, ప్రేమ కసి మొదలైనవి ఆ ప్రాంతపు పలుకు

బిడులతో అతి సహజంగా చిత్రించబడినాయి. వారిలోని ఈ సద్గుణాలను వెంకయ్య వంటి ధూర్తులు ముడి పదార్థంగా వుపయోగించుకోవడం నవలలో చాలా సహజంగా చిత్రించ బడిం''దన్నారు, వక్త.

బహుమతి పొందిన రెండో నవల ''కన్నీటికి నోరొచ్చింది''లో ఇతివృత్తం స్వాతంత్ర్యం రాక పూర్వమే గ్రామ ప్రాంతాలలో నికృత, అమానుష రూపం ధరించి, నేటికీ తన పట్టు వదలకుండా వున్న 'కట్టు బానిసతనం'—దానిపై ప్రతిఘటన గురించినదంటూ, ఆ బానిసతనపు పూర్వాపరాలను విస్తృతిని వివరిస్తూ, శ్రీ రామ మోహనరావు యిలా చెప్పారు: ''మన సమాజాన్ని కలవరుపరుస్తున్న సమస్యను ఇతివృత్తంగా తీసుకున్నదని తప్ప ఇది నవల అనిపించదు. ఆ సమస్య పై రిపోర్టు చదువుతున్నామనిపిస్తుంది. కథగా తీసుకొన్న దాని విషయంతో కొత్తదనం లేక పోవడమే కాదు. ఇందులో ధనికులూ, వారి తాబేదార్లూ సర్వ అవగుణాలకూ మూర్తులు' బీదలూ, శరీర కష్టంతో పొట్టపోసుకొనే వారూ మనుష్యునిలో మనం వుండాలనుకొనే మంచి గుణాలన్నీ పుణికి పుచ్చుకొన్న వారూను. ఇది జీవితం కాదు. జీవితం ఉగాది పచ్చడిలా చేదు, తీపి, పులుపుల మిశ్రమం.

''నాకీ నవలలో రచయిత మన సమాజంలో వున్న న్యాయ వ్యవస్థ మీద జరిపిన దాడి సమాజ పరిణామాల దురవగాహన ఫలితం అనిపించింది. మన పూర్వ సమాజ వ్యవస్థలోని న్యాయ వ్యవస్థ కన్న ఈనాడున్నది మానవు లందరూ న్యాయం ముందు సమానులే నన్న సూత్రాన్ని అంగీకరిస్తూ, ఉత్తమంగా భావించ వలసింది. కాని వర్గ సమాజ స్థితి, మన దేశంలో వున్న ప్రత్యేక పరిస్థితులూ ఆ వ్యవస్థలోని మంచిని వికసింప నీయక పోవడమే కాదు, పరిమితం చేస్తున్నాయి—ఈ అవగాహన వుంటే

## ఏడీ ఆకలి కవి ?

పసుపులేటి రామారావు

ఓ పాతికేళ్ళ క్రితం
మాగడ్డపై ఉండేవాడు—
ఆకలి కవనే వాడు
కారే కన్నీళ్ళు,
మాడే కడుపులు
ఆ కడుపుల బాదలు,
ఆ కన్నీళ్ళ గాథలు—
ఇవే అతని కవితా సరుకు !
ఆ కన్నీళ్ళకు, ఆ కడుపుల
మంటలకు, ఆ ఆకలి
బాధలకు, అతనూ
కుమిలేవాడు, మండేవాడు,
కసితో కవిత్వం రావాసేడు !

కొన్నేళ్ళుగా అతను కనపడ్డం లేదు.
హఠాత్తుగా కనిపించా డొకసారి
సినిమావాళ్ళ ఎ. సి. గదిలో !
ప్రక్కనో అమ్మాయి,
చుట్టూ బ్రాందీలు, పలావులు,
ఫలహారాలూను !
దూరంగా దిగులుతో
కలంపెట్టని వట్టి కాగితాలు !
బాబూ, ఆకలన్నాను....
'అమ్మాయి కేబరే కావాలా ?
విదేశీ బ్రాందీలు కావాలా ?'
అతని దృష్టిలో ఆకలికి
అర్థం మారిపోయింది !

ధనస్వామి కొండ బాబు మీద కట్టుబానిస పోతన్న కేసు పెట్టాలను కొన్నప్పటి నుంచి కథ నడక మరో విధంగా వుండేది.

"మంచి బలమైన శైలితో, మంచి ఇతివృత్తం తీసుకొని వ్రాసిన నవలలో సమస్యకు న్యాయం జరగలేదు" అన్నారు.

బహుమతి పొందిన మూడో నవల "వీళ్ళూ మనుష్యులే" నగర జీవితంలోని అస్తవ్యస్త స్థితిని చిత్రిస్తుంది. క్లబ్బులు, త్రాగుడు, వ్యభిచారం, జూదం మొదలైనవి నగర జీవితంలోని ఒక వికారం. వీనిలో ఏ ఒక్కటో, అన్నీనో నగర జీవితం కాదు, దానిలో ఒక భాగం మాత్రమే. ఆ భాగానికి మాత్రమే ప్రాధాన్యం ఇస్తే, ధనస్వామ్యం మన సమాజంలో తెచ్చిన నైతిక విశీర్ణత అర్థం కాదు.

అయితే నవలలో జీవం కోల్పోయిన ఫ్యూడల్ సమాజ సంబంధాలూ, విలువలకూ (కౌసల్య, శేఖర్‌ల కుటుంబం), బలపడుతున్న ధనస్వామ్య సమాజ సంబంధాలకూ, విలువల లేమికీ (విభీషణరావు, కమలల కుటుంబాలు) మధ్య సంఘర్షణ అంతర్గతంగా కనిపిస్తున్నాయి. ఈ సంఘర్షణలో దిగజారుతున్న సామాజిక పరిస్థితుల సంతానంగా నక్సలైట్ నిర్మల్ చిత్రించబడ్డాడు. కౌసల్య, శేఖర్, నిర్మల్ మరణంతో ఫ్యూడల్ సంబంధాల పరాజయాన్నీ, పాత, కొత్త సమాజాల సంఘర్షణ ఫలితంగా పుట్టినట్లు వూహించిన నక్సలిజం యొక్క పరాజయాన్నీ కూడ రచయిత వూహిస్తున్నారు.

ఈ సంఘర్షణల మధ్యన ఒక క్రమ స్థితిని వూహించ ప్రయత్నిస్తున్న చంద్రయ్యనూ, ఆ వూహలను మరి కొంచెం పొడిగించి, క్రియారూపం ఇవ్వ ప్రయత్నించే అనిల్‌నూ క్షీణ దశనుంచి సమాజాన్ని ఉన్నత, ఉత్తమ దశకు మార్చు తేగల శక్తులకు సూచనగా రచయిత ప్రవేశపెట్టారు. నవలలో ఈ పాత్రలకు ఇచ్చిన స్థానం సమాజంలో ఈ నూతన శక్తులకున్న, అల్పిష్ఠ, బలహీన స్థానానికి సూచనా?

"వస్తురీత్యా ఈ మూడు నవలలూ తెలుగులో సాధారణంగా నేడు వస్తున్న నవలలకు భిన్నంగా, సమాజ పరిస్థితులను చిత్రిస్తూ, ఆలోచింప చేస్తున్నాయి. ఇదే స్థితిలో ఇంక బతకలేము. కొత్త వ్యవస్థను నిర్మించుకోవాలి. తప్పదు అని ఉద్వేగపరుస్తున్నాయి. సూచనగానైనా మార్గం ఎటుందో చూపుతున్నాయి. కాని, "కళాత్మక దృష్టిలోంచి చూస్తే వాటికన్న ఎంతో ముందుకి లేవు."

తరువాత శ్రీ శ్రీకాంత్ తను నవలను గురించి మరికొన్ని వివరణల నిచ్చేరు. వాస్తవ చిత్రణకు తాము చేసిన కృషిని, వాటికి మూలంలోని ఘటనలనూ వివరించేరు.

శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం, తమ అనుభవాలనూ, గ్రామీణ జీవన పరిస్థితులనూ వుదాహరిస్తూ శ్రీకాంత్ నవలలో వర్ణించిన ఘటనలకు పుష్టి నిచ్చేరు. శ్రీ సెట్టి ఈశ్వర రావు వస్తురీత్యా ఈ మూడు నవలలూ తెలుగులో నేడు వస్తున్న నవలలకు ఏ విధంగా భిన్నమో వివరించి, పెద్ద పెద్ద శిల్పప్రమాణాలు పెట్టుకొని వీటిని కొలవడం సరికాదనీ, మన సాహిత్యంలో వున్న సాధారణ ప్రమాణాల దృష్ట్యా ఈ మూడూ ఒక అడుగు ముందే వున్నాయనీ అన్నారు.

సభాంతంలో శ్రీ చామర్తి దుర్గాప్రసాద్ మద్రాసు ఐఐటి లోని తెలుగు సమాజం తరఫున నిర్వహించబడుతున్న 'పురోగామి' ప్రచురణల గురించి వివరించేరు.

# కొత్త తరహా కథ

సొదుం రామ్మోహన్

ఇటీవల ఒక పక్ష పత్రికలో ఒక కొత్త తరహా కథ వచ్చింది. ఆ కథ పేరు "ముత్యాల గర్భిణి". రచయిత్రి పేరు డాక్టర్ విజయలక్ష్మి. అది బాగుందా? బాగ లేదా? అన్న విషయం అటుంచి అది కొత్త రకం కథ కాబట్టి నాలుగు ముక్కలు రాయాలని పిస్తోంది.

కథలో రచయిత్రి వైద్య శాస్త్ర సమస్యకు కళారూపం ఇవ్వడానికి ప్రయత్నించారు. అయితే ఆ సమస్య వైద్య శాస్త్రానికి సంబంధించిన సైద్ధాంతిక సమస్య మాత్రమే కాదు. అది స్త్రీల సమస్య. మరీ ముఖ్యంగా మనిషి పుట్టుకకు సంబంధించిన సమస్య. పునరుత్పత్తి క్రమంలో అరుదుగా ఎదురయ్యే సమస్య.

పురుష సాంగత్యం వల్ల స్త్రీలకు గర్భం వస్తుందని అందరికీ తెలుసు. అయితే కొందరికి ''ముత్యాల గర్భిణి'' వస్తుందని చాలా మందికి తెలిసి వుండక పోవచ్చు. మరి ''ముత్యాల గర్భిణి'' అంటే ఏమిటి? కథలోని డాక్టర్ పాత్ర ముత్యాల గర్భిణి అంటే ఏమిటో ఇలా తెలిపారు.

''ముత్యాల గర్భిణి అనేది పిండం ఏర్పడడంలో లోపం వల్ల వస్తుంది. పిండ నిర్మాణంలో వచ్చే కొన్ని మార్పుల వల్ల శిశువు, మామూలుగా శిశువుతో వుండే "మాయ"కు బదులుగా ముత్యాలు ముత్యాలుగా వుండే పెద్ద ''మాస్'' (అంటే పదార్థం) తయారవుతుంది. నిజంగా శిశువు లేక పోయినప్పటికీ శిశువుకు సంబంధించిన కణాలే అలా మార్పుచెంది ముత్యాల్లాగా తయారవుతాయి. ''ముత్యాల గర్భిణీ'' వచ్చిన స్త్రీకి మామూలు గర్భిణీ స్త్రీకి వుండే చిహ్నాలన్నీ వుంటాయి. దీనికి ట్రీట్‌మెంట్ ఏమిటంటే మందులతోనో, ఆపరేషన్ చేసో, ఆ గర్భం పోయేలా చెయ్యాలి."

కథలో ఒక స్త్రీ పాత్రకు ఇలాంటి ముత్యాల గర్భిణీ వస్తుంది. గర్భ సంచీ తీయకపోతే ఆ స్త్రీ ప్రాణానికి ముప్పు అంటారు డాక్టర్. గర్భ సంచి తీసేస్తే ఎలా మాకు వున్నది ఇద్దరూ కూతుళ్ళే. మాకు వంశోద్ధారకుడు కొడుకు కావాలి అంటాడు ఆమె భర్త. ఆఖరుకు పెళ్ళాం ప్రాణం పోతుందని భయపడి అతను పెళ్ళానికి ఆపరేషన్ చేయించడానికి అంగీకరిస్తాడు. అంతటితో కథ ముగుస్తుంది. ఇది చాలా అరుదుగా మాత్రమే ఎదురయ్యే సమస్య. సామాజిక సమస్య కూడా కాదు. అయితే అరుదైన ఈ సమస్యకు కళారూపం ఇవ్వడానికి రచయిత్రి ప్రయత్నించడం అభినందనీయం. మిగతా రచయిత్రుల్లాగే ఈమె కూడా ఏ కాల్పనికి సమస్యనో పట్టుకుని రాస్తే మనం చేసేదేమీ లేదు.

కళ అనే నాణేనికి రెండు వైపు లుంటాయి. ఒకటి కర్తవ్యం. రెండు ప్రయోజనం. కళయొక్క కర్తవ్యం ఏమిటంటే నిర్దిష్ట సన్నివేశంలో మనుషుల రాగ, ద్వేషాలను చిత్రించడం. పోతే ప్రయోజనం ఏమిటంటే, అలా చిత్రించడం ద్వారా పాఠకుల సంస్కారాన్ని తీర్చి దిద్దడం.

ఈ కథలో కళా కర్తవ్యం గురించి రెండు ముక్కలు. ఇందులో రాగ ద్వేషాల చిత్రణకు ఇవ్వాల్సినంత ప్రాముఖ్యం ఇవ్వలేదని పిస్తుంది. సమస్యను పాఠకుల ముందు వుంచడానికే కథలో ఎక్కువ భాగం కేటాయించ బడింది. అయితే

సమస్యను చిత్రించడంలో రచయిత్రి మంచి ప్రతిభే చూపారనడం నిస్సందేహం. రచయిత్రికి స్పష్టమైన వ్యక్తీకరణ వుంది. తానుగా రంగంలోకి చొరబడకుండా, పాత్రల ద్వారానే ముత్యాల గర్భిణీ సమస్యను చిత్రించారు. ఆ మేరకు శ్లాఘనీయమే. సంభాషణలను బాగా వినియోగించు కున్నారు.

కానీ ఈ సమస్యను, ఈ సమస్యతో ప్రత్యక్షంగా ముడిపడ్డ మనుషుల రాగద్వేషాలను చిత్రించడంలో కాస్త శ్రద్ధ తక్కువైందేమో అనిపించింది.

ఒక కథను ఒక రూపంలో రాసి చేతులు కడుక్కోవటం కంటె, ఇదే కథను ఇంతకంటె ఎక్కువ కళాత్మకంగా మరో రూపంలో రాయడానికి వీల్లేదా అని ఆలోచించడం అవసరం.

నిజానికి ఈ కథలో ముత్యాల గర్భిణీ స్త్రీ, ఆమె భర్త ప్రధాన పాత్రలు. అయితే ఈ ప్రధాన పాత్రలు కథ సగం గడచిందాకా నేపథ్యంలోనే వుండి పోతారు. ప్రథమార్థమంతా డాక్టర్, మరో రోగి సంభాషణలతో నిండి వుంది. న్యాయానికి డాక్టర్, డాక్టర్‌తో మాట్లాడే రోగి కేవలం ఇన్‌స్ట్రుమెంటల్. అంటే అసలు సమస్య కళాత్మకంగా ఆవిష్కృతం కాడానికి మాత్రమే ఉపయోగపడవలసిన పాత్రలు. ఈ విషయాన్ని రచయిత్రి గుర్తించినట్లు కనబడదు.

కథా ప్రారంభం నుంచి ముత్యాల గర్భిణీ, ఆమె భర్త, డాక్టర్, ఈ మూడు పాత్రలతో కథ నడిపిస్తే బాగుండేది సమస్యతో ప్రత్యక్ష సంబంధంవున్న ప్రధాన పాత్రలను ప్రథమార్థంలో నేపథ్యంలోనే వుంచి నందువల్ల 'ఎఫెక్ట్' తక్కువైంది.

మేధో స్థాయిలో పాఠకులను విద్యావంతులను చేయడం కంటె, అనుభూతి స్థాయిలో వారిని ప్రభావితం చేయడమే కళాకారుల లక్ష్యంగా వుండాలి. రచయితలకు, పాఠకులను విద్యావంతులను చేయాలన్న తపన అనవసరం. వాళ్ళకు ప్రధానంగా వుండవలసింది కళాత్మక ధోరణి.

కథలోని ఒక గదిని గురించి వర్ణిస్తే, అందులో తుపాకి వున్నట్లు తెలిపితే, కథ ముగిసేలోగా ఆ తుపాకి పేలడమో, లేక పేల్చడానికి ప్రయత్నమో జరగాలి. లేక పోతే ఆ తుపాకి వున్నట్లు తెలపడం ఎందుకు?—అంటాడు చెహోవ్.

ఆ లెక్కన ఈ కథ ప్రారంభంలో తుఫాన్ల వివరాలు, నర్సింగ్ హోం డల్‌గా వుండడం వగైరాలు రాయడం దండుగ. అనవసరమైన వర్ణన జోలికి పోక సూటిగా కథలోకి ప్రవేశించడమే కథా శిల్పజ్ఞతకు చిహ్నం.

నవల ఓడలాంటిది. అనవసరమైన వర్ణనలు అనే ''ఓవర్ లోడ్''ను అది భరిస్తుంది. కథ లాంచీ లాటిది. అనవసరమైన వర్ణనలు అనే కొద్దిపాటి ''ఓవర్ లోడ్''ను కూడా అది భరించలేదు. బుడుంగున మునిగి పోతుంది. లాంచీ డ్రైవర్‌కు ఉన్న జాగ్రత్త కథకులకు కూడా వుండాలి.

[ఇందులో ప్రస్తావించబడిన కథ సెప్టెంబరు 15 "వనిత" సంచికలో ప్రచురింప బడింది.]

## చిలుక పలుకులు

వై. వి. ఎస్. ఎన్. మూర్తి

చిలుకను వల్లించేందుకు పాటలు
కాను నేను మధురస్వరంతో పాడే
పలుకులు కమ్మని కోయిల్ని నేను

# బిడారు

(ఇరాన్ కవిత)

హెచ్. సాయి

సమయం మించిపోయింది, గాలియా!
ఇంక నా చెవి దగ్గర ఎత్తకు ప్రేమ గాథలు.
ఇంక నా నుంచి ఆశించకు ప్రేమగీతాలు,
బిడారు కదలి పోయింది, మించిపోయింది వేళ!
నీ ప్రేమ, నాదీ - అదో కథ -
కణికెడు కబళాన్ని సంపాదించు కోవడమే
బ్రహ్మ ప్రళయ మవుతున్న
ఈ మన పాడు కాలంలో
ఎక్కడుంది ప్రేమించటానికి వ్యవధి,
ఎక్కడుండి తావు కల్పనకు?
నీ పుట్టిన రోజు
విచ్చుకున్న పువ్వులా నువ్వు,
వెలిగిస్తావు హుషారుగా ఇరవై కొవ్వొత్తులు,
కానీ, సరిగ్గా ఆ రాత్రే నీ ఈడు వాళ్ళు
యువతులు వేలకు వేలమంది
కటిక నేలమీద పండుకొని
తిండిలేక పస్తులలో దొర్లుతుంటారు
చలికి వొలిగొంటూ -
కనీసం నిద్రకయినా నోచుకోని బ్రతుకులు!
అందంగా నృత్యం చేస్తావు నువ్వు,
వీణమీద వ్రేళ్ళతో మీటుతూ
శిశువులనూ, పశువులనూ మంత్రముగ్ధం
చేస్తావు,
నీ తోటి వాళ్ళు యువతులు వేలకువేలమంది
బోనుల్లాంటి కర్మాగారాల్లో
నెత్తురోడికలు కడుతున్న చేతులతో
పని చేస్తూ యమయాతన పడుతుంటారు
ముష్టివాళ్ళకు నువ్వు వేసే డబ్బులకోసం,
అబ్బురంగా దాన్నే వాళ్ళు వేతనమని
చెప్పుకొనే దానికోసం.
నీ నృత్యానికి పరిచిన తివాసీ మీది
రంగు రంగూ
మానవ జీవితంలో నుంచి పిండుకొని,
నెత్తురుతో రంగరించినదే మరి,
దాని పోగుల ముడి ముడిలో
అమాయకుల కళ్ళనుంచి జారిన
కలల బొట్టు బొట్టులో
దాగి ఉన్నై అవమాన సహస్రాలు.
ఇక్కడే చల్లారినవి ఒక వెయ్యి
యౌవ్వన జ్వాలలు
ఇక్కడే కొయ్యిబారినవి ఒక వెయ్యి
చిన్నారి చేతులు
ఇక్కడే మొద్దుబారినవి ఒక వెయ్యి
చురుకయిన చూపులు
కాదు, గాలియా అసలు మించి పోయింది వేళ!
ఇది వలపుకూ, పాటకూ సమయం కానే కాదు
ప్రతి ఒక్కటీ భగ్గుమంటున్నది,
నాలుక చాస్తున్నది
విమోచనానికి తరుణం యిది, తప్పితే రాదు,
కార్యాచరణకు ఉపక్రమణ మిది, ఆలస్యం
తగదు -
ఇది సమరం, ఇది విలయం, ఇది
విజృంభణం.
ఆపు! చిరునవ్వు నవ్వకు!!
తియ్యని నీ చూపులతో నా కాళ్ళకు
బందాలు వెయ్యకు.
ఈ ప్రేమా, ఆ పాటా, మధువూ,
మోహన మనో విరాళి -
అన్నీ అంతే - అడ్డంకులు - సంకెళ్ళు!
చెమ్మ ఊరుతుండే బాగ్ - యె - షా
నేలమాళిగలలో
నిష్ఠురమైన నీడలేని ఖర్గ్ ద్వీప ప్రవాసంలో
ఈ నరకకూపపు మారుమూల
చీకటి కోణాలలో

పండితులు నా మిత్రులు ఎంతోమంది
మగ్గుతున్నారు.
తొందరపడకు గాలియా!
నా చెవి దగ్గర ఎత్తకు ప్రేమ గాథలు,
ఇంక నానుంచి ఆశించకు కమనీయ
కల్పనలు,
ఇంత తొందరెందుకు గాలియా?
అసలు బిదారు తిరిగి వచ్చేదాకా మనము
వేచి ఉండక తప్పదు!
స్వచ్ఛమైన స్ఫటిక బాహువులను చాచి ఉషస్సు
నిశీధి నల్ల తెరలను విచ్చుకత్తులతో చించి
తునాతునకలుగా కుప్పపోసే రోజు,
కిటికీ కిటికీల్లో నుంచి
ఉదయ సూర్యకాంతులు దూసుకొని
వస్తున్నప్పుడు
నా కామ్రేడ్స్ అందరి ముఖాలు హాసభాసుర
మైనప్పుడు
నీకోసం సఖీ, నేనే పనికట్టుకొని వస్తాను
పద్యాలు, ముద్దులు మురిపాల మల్లీవల్లీ
వల్లరుల మధ్యన కూర్చుని
చెప్పని ప్రేమగాధలను చెబుదువు గాని.

[ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఆంధ్రానుసరణం]

# పాలస్తీనా కవిత

## మహమ్మద్ దర్వీష్

*ఇంటింటా దీపాలు వెలిగించకపోతే*
*మన కవితకు లేదు రంగు,*
*లేదు రుచి, లేదు ధ్వని*

**కథానిక**

# "ది ట్రిక్"

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆడవాళ్ళకి సిగరేట్స్ తాగే మొగాళ్ళంటే ఇష్టం ఎక్కువగా వుంటుందనే అభిప్రాయం నేను కాలేజీలో చదువుకునే రోజుల్లోనే ఏర్పడింది. మొగవాళ్ళకి లిప్ స్టిక్ పెదాలకి రాసుకునే ఆడవాళ్ళంటే ఆకర్షణ ఎక్కువగా వుంటుందన్న అభిప్రాయం కూడా అప్పుడే ఏర్పడింది.

చెల్లాయ్ కూడా ఓసారి హోటల్లో బయట పడింది నా ముందు.

"మొగాళ్ళు నీట్‌గా టక్ చేసుకొని, సాయంత్రం రద్దీగా వుండే సెంటర్‌లో నిలబడి, సిగరెట్ తాగుతూ, రింగులు వదులుతుంటే మా క్లాస్‌మేట్స్ చాలామందికి వాళ్ళు చిన్న సైజు హీరోల్లా అగుపిస్తారు'' అన్నది. నిజమే ననుకున్నాను.

చెల్లాయ్‌కి పెళ్ళయి మూడు నెలలయింది. బావ గారు ఒక టుబాకో కంపెనీ ఫేక్టరీలో టెక్నిషియన్. ఆయన చాలా మంచివాడు. చెడ్డ అలవాట్లేమీ లేవు, ఒక్క సిగరెట్స్ తప్ప.

'చెడ్డ అలవాటు' అని నేనంటం లేదు. పెళ్ళయి వారం రోజులు దాటాకట చెల్లాయి ఓసారి నాతో అన్నది:

"రెండు సంవత్సరాల క్రితం అలవాటయింది ఆయనకి సిగరెట్స్ కాల్చటం, వాళ్ళ కంపెనీ వాళ్ళు సంవత్సరాని కిన్నని సిగరెట్ పెట్టెలు వుచితంగా ఇస్తారు. అవి చాలక బయట కొంటారు.''

"చిన్న సైజు హీరో అన్న మాట'' అన్నాను నవ్వి.

"ఛీ, ఇదో చెడ్డ అలవాటు, బయట వాళ్ళు ఎవరయినా సిగరెట్ తాగుతూంటే చూడటానికి బావుంటుంది కాని, మన భర్త అనుకున్న మనిషి కాలుస్తే సహించలేను. పాడు వాసన. ఎలాగైనా మాన్పించాలి అయ్యగారి చేత."

ఆడవాళ్ళ పెదవులకుండే లిప్ స్టిక్ సంగతి కూడా ఇంతే నేమో: 'నా భార్య' అనుకున్న వ్యక్తి పెదాలకి రంగు పూస్తే నేను పూరుకుంటానా, సరిపెట్టుకొంటానా అన్న విషయం తేల్చుకోడానికి నాకింకా పెళ్ళి కాలేదు.

రెండు మూడు రోజులకో సారి చెల్లాయ్ ఇంటికి వెళ్తూండే వాడిని, వెళ్ళినప్పుడల్లా బావ గారు, "మీ చెల్లాయ్ సిగరెట్స్ మానమని చంపేస్తోందండి, భరించలేక పోతున్నాను ఈ పోరు" అంటూండే వారు.

"మీరు మానా లనుకుంటే ఇప్పుడే మానడం మంచిది. ఇంకో రెండు మూడు సంవత్సరాలు ఆగితే వాటికి పూర్తిగా బానిస అయిపోయే ప్రమాదం వుంది" అని హెచ్చరిస్తూ, మానేయటం వుత్తమం అని సలహా ఇస్తూండే వాడిని.

చెల్లాయ్, బావగారు చివరకి ఓ రాత్రి పేకాట ఆడుతూ ఒక నిర్ణయానికి వచ్చారు, చెల్లాయ్ వత్తిడి ఎక్కువవటం వల్ల. రోజూ పేక ముక్కలు కలుపు తుంది చెల్లాయ్. బావ గారు కట్ చేసి ఓ ముక్క తీస్తారు. ఆ పేక ముక్క ఏ సంఖ్యను సూచిస్తే అన్ని సిగరెట్లు మాత్రమే త్రాగాలి ఆ రోజు. ఉదయం కాఫీ కప్పుతోబాటు చెల్లాయ్ పేక బొత్తిని కూడా తీసుకెళ్తూండేది బావ గారి గదిలోకి.

ఒకసారి ఆసు వచ్చేది. ఒకటే కాల్చాలి ఆ రోజు. ఒకోసారి కింగ్ వచ్చేది. డజను తగలెయ్యొచ్చు ఆ రోజు. రెండు, మూడు, పదీ ఇలా ఒకో రోజూ ఒకో ముక్క తీస్తూండే వారు. చెల్లాయ్ మీద ప్రేమో, ఆయనకే సిగరెట్స్ మానాలనే కోరిక కలిగిందో తెలియదు కాని, పేక ముక్క ప్రకారం ఎక్కువో, తక్కువో, అన్నే కాల్చేవారు.

ఈ విధంగానే సంవత్సరం గడిచింది. నెలలు గడిచేకొద్దీ బావ గారి అదృష్టం తరిగి పోయింది. ఎప్పుడో గాని అయిదు సంఖ్య దాటేది కాదు ఆయన స్వయంగా తీసే ముక్క. మధ్యలో పండగ వొస్తే, ఆ రోజు అసలే కాల్చనిచ్చేది కాదు. దగ్గరే కూర్చుని, ఆయనకి సిగరెట్ కాల్చే టైమ్‌కి తలనొప్పి వచ్చినప్పుడల్లా, ఏవేవో కబుర్లు చెప్తూ మరిపిస్తూండేది.

సంవత్సరన్నర అయింది చెల్లాయ్ పెళ్ళయి. రెండు అభివృద్ధులు సాధించింది. ఇప్పుడు బావ గారు పూర్తిగా సిగరెట్స్ కాల్చడం మానేసారు. తండ్రి అయారు.

ఓ రోజు మాటల్లో యదాలాపంగా చెల్లాయ్ ఓ నిజాన్ని చెప్పింది నాకు. తర్వాత నాలిక కొరుక్కుంది తన మోసం బయట పెట్టుకున్నందుకు.

"చివరి ఎనిమిది నెలలు అయితే పేక బొత్తిలో అన్నీ రెండు, మూడు, నాలుగు, అయిదు సంఖ్య లుండే పేక ముక్కల్ని మాత్రమే వుంచేదాన్ని. ఆ పై సంఖ్యల ముక్కలు అసలుంచేదాన్ని కాదు. అందు కోసం ఒకే రకం పేకలు చాలా కావాల్సి వచ్చింది."

చెల్లాయ్, బావ గారు పడ్డ అవస్థ స్వయంగా చూసాను కనుక, ఇప్పు డెవరయినా సిగరెట్ ఆఫర్ చేసినా కూడా, 'నో, థాంక్స్' అని తప్పించుకుంటున్నాను. అలా ఆఫర్స్‌తోనే మొదలయింది బావగారి కా అలవాటు మొదట్లో మరి.

న్యాయానికి తావులేని చోట ప్రజల సంకెళ్ళు మార్పు అవుతాయే గాని, వారి భవిష్యత్తుతో మార్పు వుండదు.

రాజస్పీర్

# సోమసుందర్

## * సమ్మెట దెబ్బలు *

నిన్నటి ఉదయాస్తమయాలు నా గుండెల నిండా సమ్మెట దెబ్బలు నింపాయి, నేటి ఉదయం కత్తుల తళత్తళలు ...ఖడ్గాల్ని ఖడ్గాలు ఢీకొంటున్న భయంకర శబ్దాలు! చకిత్ చకిత నాదాలు....!

పోటెత్తిన నది అడ్డుపడిన కొండను ఢీకొని విరిగిపడిన అలల హోరు! రెక్కలు తెగిన పిట్టల ఆర్తారవాలు....మహా వృక్షాలు కూలుతున్న చప్పుళ్ళు! అర్ధరాత్రి కూలీల పేటలో చెలరేగిన అగ్నిజ్వాలల వైవాహిక కోలాహలం! తాండవ ఝంకారావం!

నేటి అస్త్రాద్రి నింపే అరుణకాంతులలో ఎన్నిటిని రహస్యంగా ఈ రాత్రి గుండెలో దాచు కుంటుందో....ఎన్నిటిని ప్రత్యూషాని కందిస్తుందో!....ఏ మహా విప్లవానికి అంకు రార్పణ జరుపుతుందో, అరెరే—అధికారీ! ఎలా తెలుస్తుందిరా నీకు?

## * కత్తుల తళత్తళలు *

గౌలికి కదులుతూన్న బ్రహ్మ చెముడు మట్ట—కునికిపాట్లు పడుతూన్న జెయిలు సెంట్రీ లాగుంది....

ఎక్కడో అదృశ్యంగా గొంతెత్తి రోదించే నక్క—నిద్రకాని నిద్రలో, ఎప్పుడో చనిపోయిన పెళ్లాం జ్ఞాపకాల బరువుతో ఏడుస్తూన్న ఖైదీ లాగుంది

శ్మశానంలోనో జెయిలులోనో ఉన్నదే కాదు: చీకటి ఎక్కడున్నా అసహ్యమే! అమంగళమే! నివార్యమే!

కనుకనే నేనీ కవితా గాండీవం ఎక్కు పెట్టింది చీకటి గుండెల్ని చీల్చడానికే

## * మహాక్రతువు *

నా జాతి నెన్నుదుట విరుస్తూన్నది ప్రళయ నేత్రం కాదు!

అధికారి చెప్పు దెబ్బకు పడిన గాయం! పచ్చి ఆరనూ లేదు, నెత్తురు చిమ్మడమూ మానలేదు.

ఎన్నాళ్ళనుంచో ఎవరు చెప్పగలరు? ఏ మందులకూ లొంగడం లేదు, ఏ మూలి కలూ పనిచేయడం లేదు.

నా జాతి తోక వూపుతూ బ్రతికినంత కాలం, ఈ గాయం మానదు!

అల్పాతి అల్పమైన వాగ్దానాల మాయాజాలానికి మోసపోయి, తృప్తిపడినంత కాలం ఈ గాయం మానదు.

పీడించే వాడి చేతిలో తుపాకీ చూసి భయంతో తోక ముడిచి చీకట్లోకి తప్పుకునేంత కాలం—ఈ గాయం నెత్తురు చిమ్మడం మానదు! ఐతే దీనికి నివారణోపాయం లేక పోలేదు....

నా పీడితుల జాతి యావత్తూ దళితనిగళ విచ్ఛేదనా మహాక్రతువు ఉపక్రమించి; పరాక్రమించి విజృంభిస్తే తప్ప ఈ గాయం మానదు. ఈ అవమానాల ఆక్రోశం మానదీ జాతి।

నా జాతి నొసట గాయాలే తప్ప ఇంకా సూర్యోదయం కాలేదు। పీడకుల పక్షం సమైక్యమై ఉంది. దొంగలూ దొంగలూ రాజీలు పడ్డారు. ఊళ్ళూ పోళ్ళూ పంచుకొంటున్నారు।

పీడితుల పక్షీయుల మనుకొంటున్నవాళ్ళు అంతః కలహాలతో ఆహుతి అవుతున్నారు;

దళితుల పక్షం వహించి ఆత్మార్పణకు సంసిద్ధమయ్యే వీరులు విశీర్ణమవుతున్నారు..

ఇంకేం మానుతుందీ గాయం? నా నేల తల్లి నిట్టూరుస్తోంది।।

[నే నిటీవల రచించిన "కాలం వీలునామా" అనే బృహత్కావ్యంలో—4, 5, 6 పర్వాలివి—సోమసుందర్]

## నరాలలో క్రోధానలం

### ఆవంత్స శశికాంత్ శాతకర్ణి

వస్త్రకాళితం కాని పురాస్మృతులు
అదే పనిగా వేధిస్తున్నాయి
నిర్నిద్రతో నన్ను బాధిస్తున్నాయి
రాత్రి ప్రకంపనాలు తగ్గి
లోకం శ్వాసలో తేలి
గాలిలో కలుస్తున్నాయి
దూరంగా చర్చి గంటలు ఆగాక
నిశాచరుల పాట మొదలయింది
ఆకాశం మీంచి మురికి గుంటలోకి
జారిపడిన ఇందు శకలం
'నరాలలో పారే క్రోధానలం తప్ప
మనిషి అంటే మరేమిటి'
అని ప్రశ్నిస్తోంది
దగ్గరగా ముడుచుకుపోయి
నిద్రపోతున్న రథ్యాకాంతను
లేపుతున్నాడు పిల్లగాలి చేతులతో
కామాతురుడైన నిశాపురుషుడు
తరతరాల జ్ఞాన శిఖరాలధిరోహించి,
మానవుడు కాలుజారి
పడిపోతున్నాడ,
నేటి మనిషి ఒక వంతు నాగరికుడైన
మాడొంతులు ఆటవికునిగా
కొనసాగుతూనే ఉన్నాడనీ
నా ఎముకలలో బాధ ఘూర్ణిల్లింది!

## నీవు

### యన్ జి.డి. చంద్రశేఖర్

ఆరిపోకు
పారిపోకు
అసలు నీవు
కాలిపోకు.
వాడిపోకు
సోలిపోకు
అసలు నీవు
ఎండిపోకు,
సింహాలే
గర్జించిన
ఎదురొడ్డి
దెబ్బలాడు,
కోడెత్రాచు
బుసకొట్టిన
కొరడావై
త్రుంచివేయ్,
పెనుచీకటు
లావరించిన
వెలుగు జ్వాలవై
ప్రజ్వరిల్లు
ఆగిపోక
సాగిపో
సాగిపోతూ
రగిలిపో
రగిలిపోతూ
పగిలిపో,

# నిజాం కొలువులో విప్లవ కవి విచిత్రానుభవాలు

'విశ్వమిత్ర'

ఉర్దూ సాహిత్య ప్రపంచంలో విప్లవకవి (తిరుగుబాటు కవి) జోష్ మలీహాబాదీ పేరెరగని వారు వుండరు. ఆయన తన శిష్ట, సాంప్రదాయిక కవితలతో ఉర్దూ సాహితీలోకం అభిమానాన్ని ఎంతగా చూరగొన్నారో, పదునైన తన కవితలతో మన జాతీయోద్యమ కాలంలో ప్రజల్ని అంతగానూ వుర్రూతలూగించారు. ఆ నాడు బ్రిటిష్ పాలకులకు ఆయన కవితలు గంగవెర్రులెత్తించుతుండేవి. ఆయన రచన లెన్నటినో వాళ్ళు నిషేధించారు. కాని ఆ తిరుగుబాటుదారుని గొంతు నొక్కడం వాళ్ళకు సాధ్యం కాలేదు.

నాటి జాతీయోద్యమ అగ్ర నాయకులైన పండిత నెహ్రూ, అబుల్ కలాం ఆజాద్, సరోజనీ దేవి వంటి వారికీ, విశ్వకవి రవీంద్రునికీ జోష్ అత్యంత సన్నిహితుడు.

కాని సామ్రాజ్యవాదుల నీతి ఫలితమైన దేశ విభజన, తదనంతర పరిణామాలూ ఆయన్ను విచలితుణ్ణి చేశాయి. స్వతంత్ర భారత దేశంలో ముస్లింలకు, ఉర్దూ భాషకు భవిష్యత్తు లేదని ఆయన భావించారు. పండిత నెహ్రూ ఎంత నచ్చజెప్పినా వినకుండా ఆయన పాకిస్తాన్‌కు వెళ్ళిపోయారు. పాకిస్తాన్ మీద ఆయన పెట్టుకున్న భ్రమలు త్వరలోనే పటాపంచలయాయి. అక్కడ ఆయన స్వీయ జీవితంలో సుఖపడిందేమీ లేదు. భారత దేశపు మిశ్రమ సంస్కృతిలో పుట్టి పెరిగిన ఆ మహాకవి, ఆ మతోన్మాద పాలనలో ఎన్నో అగచాట్లు పడ్డారు. ఆయన పొందిన ఆశాభంగానికి, నాలుగేళ్ళక్రితం మన దేశంలో వెలువడిన "యాదోన్‌కీ బరాత్" (జ్ఞాపకాల తోరణాలు అందాం. ఇది ఆయన ఆత్మ కథ) ప్రత్యక్ష నిదర్శనం. పాకిస్తాన్ పాలకులు ఈ పుస్తకాన్ని నిషేధించటం జోష్ విషాదమయ జీవితానికి అద్దం పడుతూంది.

జోష్ మన పూర్వపు నిజాం సంస్థానంలో కూడా కొంతకాలంపాటు ఆఖరు నిజాం నవాబు దగ్గర కొలువు చేశారు. తన స్వీయకథలో జోష్ చెప్పిన ఆనాటి ఉదంతాలూ, సొంత అనుభవాలు అప్పటి నిజాం రాజ్యంలోని భూస్వామ్య వ్యవస్థ జుగుప్సాకర స్థితిని కండ్లకు కట్టినట్లు చూపెడతాయి.

ఈ తరం పాఠకులకు, నిజాం పాలన ప్రత్యక్షానుభవం లేని తెలుగువారందరికీ కూడా ఈ అనుభవాలు ఆసక్తిదాయకంగా వుండగలవు.

జోష్ పుట్టి పెరిగింది ఉత్తర ప్రదేశ్‌లోని మలీహాబాద్ అనే గ్రామానికి చెందిన ఒక పఠాన్ జాగీర్దారీ కుటుంబంలో. ఆయన బాల్యమూ, కౌమారమూ భోగభాగ్యాలతో గడిచాయి. పఠాన్ జాతి ఆత్మాభిమానం, జాగీర్దారీ కుటుంబ జీవితంనుంచి సంక్రమించిన

రాజసం, మాటపడకపోవటం, తాను అనదలచుకొన్నదేదో కుండబద్దలు కొట్టినట్లు మొహాన్నే అనేయటంలాంటి గుణాలన్నీ జోష్‌కు అబ్బాయి. ఇవి ఆయన్ను తన అభిమానులకు ఎంతో దగ్గరగా తెచ్చాయి. అదే సమయంలో, అవి ఆయన్ను సామాజిక జీవితంలో ఎన్నో యిబ్బందుల పాలు జేశాయి; బతకనేర్వని మనిషిని చేశాయి.

జోష్ హయాం వచ్చేటప్పటికి సంక్రమించిన ఆస్తి చాల భాగం హరించి పోయింది. ఆయన భుక్తికోసం ఉద్యోగం చేయాల్సిన స్థితి వచ్చింది.

విద్యావంతులైన ముస్లింలలో నిజాం గొప్ప భాషా పోషకుడు, వితరణశీలి అనే అభిప్రాయ ముండేది. అతడి మతాభిమానం గురించి ఉత్తరాది ముస్లింలకు మరింత గట్టి భ్రమ లుండేది. జోష్‌కు కూడా ఈ భ్రమలు బాగానే వుండేవి. అందుచేతనే ఆయన తన కష్టకాలంలో నిజాంను ఆశ్రయించేందుకు సిద్ధమయారు.

హైద్రాబాద్ వచ్చేనాటికే జోష్ ఉర్దూ సాహితీ ప్రపంచంలో లబ్ధప్రతిష్ఠుడు. నిజాం సంస్థానంలోని పలువురు ప్రముఖుల పేరిట, ఆ నాటి ప్రసిద్ధ ఉర్దూ పండితులు కొందరి పరిచయ లేఖలు చేతబట్టుకొని ఆయన హైద్రాబాద్ వచ్చారు.

ఆయన హైద్రాబాద్ వచ్చిరావడంతోనే, మొట్టమొదట ఆ నాటి సంస్థాన ప్రధాన మంత్రి మహారాజా క్రిషన్ ప్రసాద్‌ను కలుసుకొన్నారు. క్రిషన్ ప్రసాద్ స్వయంగా గొప్ప విద్వాంసుడు; మంచి సంస్కారం కల వ్యక్తి కూడా. ఆయన జోష్‌ను ఎంతో ఆదరించారు. కాని, అవి ఆయన నిజాం ఆగ్రహానికి గురైవున్న రోజులు. నవాబు గారికి అకారణ ఆగ్రహాలూ, అనుగ్రహాలూ మామూలే.

ఆ స్థితిలో తాను జోష్‌కు ప్రభుదర్శనం చేయించలేక పోతున్నందుకు మహా రాజా ఎంతో విచారించారు. ఆర్థిక మంత్రి అక్బర్ హైదరీకి తానంటే మంచి గురివుందని చెబుతూ, జోష్‌ను ఆయనకు పరిచయం చేస్తూ ఒక సుదీర్ఘ లేఖ రాసిచ్చారు. సర్ రాస్ మసూద్ అనే మరో ఉన్నతాధికారిని జోష్‌కు తోడిచ్చి హైదరీ దగ్గరకు పంపారు.

హైదరీ, జోష్‌ను మరుసటి గురువారం వచ్చి కలుసుకోవలసిందిగా చెప్పాడు. ఈలోగా నవాబు గారి దర్శనానికి ఏర్పాటు చేస్తానన్నాడు.

హైదరీ మంగళవారం నాడే జోష్ విడిదికి ఫోన్‌చేసి ఆయన్ను తన భవనానికి పిలిపించుకొన్నాడు. అప్పుడు రాస్ మసూద్ కూడా అక్కడే వున్నాడు. అతిథి సత్కారాలేవో పూర్తి అయాక హైదరీ, బ్రిటిష్ ప్రభుత్వం తనకు సర్ బిరుదు ప్రదానం చేసి నప్పుడు పలువురు కవులు రాసి సమర్పించిన ప్రశంసాపూర్వక కవితల కవిలె జోష్ చేతికిచ్చి "జోష్ సాబ్, మీరు కూడా ఒక 'కతా' (రెండు పంక్తుల ప్రశంసా కవిత) రాసిస్తే...." అంటూ దేవురించాడు.

మొదటిసారి కలుసుకొన్నప్పుడే జోష్‌కు హైదరీ ఉర్దూ ఉచ్చారణ విని జుగుప్స కలిగింది. 'ఖతా' అన్న పదాన్ని అతడు 'కతా' అని పలకడం విని మరింత యిదై పోయారు. బ్రిటిష్ వ్యతిరేకి అయిన జోష్‌కు, సర్ బిరుదు పొందిన హైదరీ తన్ను ప్రశంసిస్తూ పద్యం చెప్పమనేసరికి మరింత మండి పోయింది.

ఆయన తన మనోభావాలను దాచుకోలేకపోయారు. "హైదరీ సాహెబ్, మరోలా అనుకోనంటే ఒక మాట చెబుతాను. సర్, బిరుదు పొందినవాడి 'అమ్మను' తిట్టాల్సి

వస్తుంది'' అనేశారు. సర్ బిరుదాంకితులు యిద్దరూ మండిపోతూ మరో గదిలోకి నిష్క్రమించారు. జోష్ తన మకాంకు వెళ్ళిపోయారు. తన స్వభావానికి దర్పణంలాంటి ఈ ఉదంతాన్ని గురించి ఆయన తన స్మృతుల్లో యిలా రాసుకొన్నారు: ''అయ్యో, యిదీ నా లోకజ్ఞానం. వచ్చింది ఉద్యోగం కోసం, అది మరచిపోయి నోరు పారేసుకొన్నాను. అందుకనే మా గనీ ఖాన్ అనేవాడు, షబ్బీర్ హుసేన్ ఖాన్ (జోష్ పూర్తి పేరు) కవిత్వం గట్రా బాగానే రాస్తాడు గాని మిగతా విషయాల్లో మాత్రం మహాత్ముడి లాంటి శుద్ధ వి. పి. అని."

* * *

ఈ వృత్తాంతం విన్న మీదట జోష్‌ను అభిమానించే నవాబ్ మెహదీ యార్‌జంగ్ అనే ఆయన, అతణ్ణి తన తండ్రి అయిన నవాబ్ ఇమాదుల్‌ముల్క్ దగ్గరకు పిలుచుకు వెళ్ళి ఆయనకు పరిచయం చేశారు. జోష్ అనే ప్రసిద్ధ కవి మీ దర్శనానికి వచ్చారు అని ఆయన తన తండ్రితో చెప్పారు. ఇమాదుల్ ముల్క్ పట్టించుకోలేదు. జోష్ చిన్నబోయారు. అప్పుడు మెహదీయార్‌జంగ్, జోష్ అంటే ఎవరనుకొంటున్నారో, హిస్సాముద్దవులా తహ్వర్‌జంగ్ నవాబ్ ఫకీర్ మొహ్మద్‌ఖాన్ గారికి సాక్షాత్తు మనుమడు అని తమ తండ్రి గారికి అందించారు. అప్పుడు ముసలాయన త్రుళ్ళిపడ్డాడు. ఆయనకు జోష్ మీద ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది. జోష్‌ను ఎంతో ఆదరించి స్వీయరచన ఏదన్నా వినిపించమని అడిగారు.

జోష్ తన ఒక కవిత చదవగా, నవాబ్ యిమాదుల్‌ముల్క్ ఎంతో మెచ్చుకొని నిజాం పేరిట ఒక పరిచయ లేఖ రాసి తన కుమారుని చేతికిచ్చి, ఫలానా నవాబు ద్వారా దాన్ని నిజాంకు అందజేయమని చెప్పాడు.

ఇమాదుల్‌ముల్క్ అంతటి పలుకుబడి కలిగిన వ్యక్తి సిఫారసు చేసిన తరువాత కూడా దాదాపు ఒక నెల రోజుల వరకు నిజాం నుంచి ఎలాంటి వర్తమానం లేకపోవడంతో జోష్ నిస్పృహ చెందుతున్న స్థితిలో కింగ్ కోఠీ* నుంచి పిలుపు రానేవచ్చింది. నవాబ్ ఖాదర్‌యార్‌జంగ్ అనే ఉన్నతోద్యోగి ఒకాయన కారు తీసుకొని సరాసరి జోష్ విడిదికి వచ్చారు.

నిజాం సంస్థాన వైభవం గురించి ఎంతెంతో వూహించిన మహాకవికి, సంవత్సరాల తరబడి సున్నం మొహం చూడక పాకుడు పట్టిన కోఠీ గోడలు, కోట దర్వాజాలా వున్న సింహద్వారానికి వ్రేలాడగట్టిన చిరిగిన అడ్డుతెర దర్శనమిచ్చాయి. ''ఎనలేని సంపదల మధ్య ఈ అనంతకోటి దరిద్రం ఏమిటూ'' అని విస్తుపోతూ ఆయన రాజభవనంలోకి ప్రవేశించారు.

అక్కడ ఆయనకు మరింత దౌర్భాగ్యస్థితి కనిపించింది. కళాకాంతులు లేని ఒక

* కింగ్ కోఠీ—నిజాం నవాబు నివాస భవనం. దీని దర్వాజాల మీద వున్న కె. కె. అనే పొడి అక్షరాల్నిబట్టి యిది మరెవడో కమాల్ ఖాన్ భవనం అయివుండాలనీ, నవాబు వాణ్ణి వెళ్ళగొట్టి ఈ భవనాన్ని సొంతం చేసుకొని కింగ్‌కోఠీగా చెలామణీచేసి వుంటాడనీ జోష్ రాశారు.

వరాండాలో కుప్పలు పడేసిన నానారకాల పాత సామాన్ల మధ్య కనీసం పాలిష్ అన్నా లేని ముక్కాలి పీటలాంటి కొయ్య కుర్చీమీద, ఎక్కడికక్కడ మాసికలు పడ్డ షేర్వానీ, అరచేతి మందాన మురికి పేరుకొన్న కుచ్చులేని టోపీ తగిలించుకొని బిర్రబిగిసి కూర్చున్న ఒక బక్కపల్చని మనిషి (నిజాం నవాబు)....ఎదురుగా తెల్లని షేర్వానీలు, తలపాగాలు ధరించి తలలు వంచుకొని చేతులు కట్టుకొని కొంగల బారులా నిలబడివున్న ఓ పాతిక, ముప్పై మంది ఉన్నతాధికారులు కనిపించారు.

జోష్ సమర్పించిన నజారానా (కానుక) స్వీకరించి, నిజాం అక్కడ వున్నవారితో యిలా అన్నాడు: "ఇతడెవరో తెలుసా....ఇమాదుల్ ముల్క్ రాశాడు, ఫకీర్ మొహ్మద్ ఖాన్ గోయా గారి మనుమడట!" (ఫ్యూడల్ అభిజాత్యం చూడండి, ముందు వంశం, ఆ తరువాతనే మరేదైనా. జోష్ గొప్ప కవి, విద్వాంసుడు అనేదిగాక ఫలానా నవాబు గారి వంశీకుడు అనేదే ఇమాదుల్ ముల్క్ దృష్టిలోనూ, నిజాం దృష్టిలోనూ ముఖ్యమైంది). అవధ్ రాజ్యం విచ్ఛిన్నమై పోకుండా వుండే వుంటే (ఉత్తర ప్రదేశ్‌లోని ఒక ముస్లిం సంస్థానం—దాన్ని బ్రిటిష్‌వాళ్ళు కలిపివేసుకొన్నారు), ఉత్తరాది ముస్లింలను అవధ్ సంస్థానమూ, దక్కన్ ముస్లిం లందరినీ తన సంస్థానమూ కడుపులో పెట్టుకొని కాపాడి వుండేది కదా అని నిజాం విచారించాడు.

ఆ తరువాత అతడు రాజగురువు హజ్రత్ జలీల్‌తో (ఈయన కూడా అవధ్ ఆ ప్రాంతాల వాడే), "పంతులూ, నీకు వీళ్ళ కుటుంబం బాగానే తెలుసు అనుకొంటాను"

# ఎపుడు ఉదయిస్తుంది నవత?

**తిరునగరి**

మారింది మారింది ప్రభుత
ఏడ ఉదయించింది నవత?
ఎవడు వింటున్నాడు ఈ ప్రజల గోడు
ఎన్నాళ్ళు రగులునీ అవినీతి కాడు?
ఆకాశమును చేరె ధరలు
అంగళ్ళ దోపిడీపరులు
ఏమి సాధించింది నిన్న?
నేడు వచ్చిన మార్పు సున్న
మాటలన్నియు వట్టి టక్కు
మారునా నిరుపేద లక్కు
రాజకీయము డుబ్బుడుక్కు
దేవుడేనా ప్రజకు దిక్కు
బాపు చెప్పిన వేదమంత్రం
జపియించుటేనా తంత్రం

ఇన్నేళ్ళ కలలన్ని పూజ్యం
ఎపుడు వచ్చును రామరాజ్యం?
దేశాన కోట్లాది జనము
ధీహీ అంటున్నది కనుము
వారు సోదర్యతే అనుము
స్వార్థబుద్ధిని సుంత విడుము
మేలుకోవాలిపుడు ప్రజలు
తొలగునప్పుడు జాతి రుజలు
దేశమంటేనోయి మనము
అన్న గురుజాడను కనుము
మారింది మారింది ప్రభుత
ఎపుడు ఉదయిస్తుంది నవత?
మేలుకోవాలిపుడు ప్రజలు
తొలగునప్పుడు జాతి రుజలు

అన్నాడు. హజ్రత్ జలీల్ వయోవృద్ధుడు, గొప్ప పండితుడు. ఆయన్ను కూడా నిజాం "నీవు" అనే సంబోధించేవాడు. రాజగురువు చేతులు కట్టుకొని జోష్ కుటుంబమంతటినీ తాను బాగా ఎరుగుదుననీ, ఆయన తండ్రి ఒకప్పుడు తనకు ఆశ్రయమిచ్చినవాడనీ మనవి చేశాడు.

అప్పుడు నవాబు గారికి జోష్ విద్వత్తును పరీక్షించాలనే ఆలోచన తట్టింది. ఏదన్నా కవిత వినిపించమన్నాడు. జోష్ తన ఒక గజల్ వినిపించారు. అది నిజాంకు ఎంతో నచ్చింది. "ఇతగాడు యింకా యువకుడు. పెద్దయాక హజ్రత్ జలీల్ అంత వాడవుతాడనిపిస్తూంది'' అని ప్రశంసించాడు. ఉన్నట్లుండి, ''జోష్, నీకు పెండ్లయిందా?'' అని అడిగాడు.

జోష్ తనకు పెండ్లయిందనీ, తన భార్య కూడా తన వెంట హైద్రాబాద్ వచ్చి వేసిందనీ చెప్పుకొన్నారు. నీకు ఉద్యోగం, సద్యోగం ఏమీ లేదు కదా, ఆమె నిక్కడ కెందుకు పిలిపించావని నవాబు ప్రశ్నించాడు. ''మీ సంస్థానంలో నాకు ఉద్యోగం దొరకటం ఖాయమని మా ఆవిడకు గట్టి నమ్మకం" అని జోష్ జవాబిచ్చారు. ''ఆవిడ కంతగా నమ్మకం కుదరడాని కారణమేమిటి?'' అని నవాబు ప్రశ్నించాడు.

తన స్వప్నోదంతం* నిజాంకు చెప్పాలా లేదా అని జోష్ సంకోచిస్తుండగా, అప్పుడు దర్బార్‌లోనే వున్న మెహదీ యార్ జంగ్ ఆ ఉదంతాన్ని తానే నిజాంకు నివేదించాడు.

''రసూల్ స్వయంగా యితణ్ణి నా కప్పగించాడన్న మాట'' అంటూ నిజాం గుండెలమీద చేతులాన్చుకొని, భక్తి పారవశ్యంతో తలవంచి దైవప్రార్థనలో మునిగి పోయాడు.

*　　　*　　　*

వారం తిరక్కుండానే జోష్‌ను ఉస్మానియా విశ్వవిద్యాలయం అనువాద విభాగంలో రాజకీయ అర్థశాస్త్ర అనువాదకుడుగా నియమిస్తూ నిజాం ఫర్మానా జారీ చేశాడు. తనకు అర్థశాస్త్రం ముక్కూ మొహమూ తెలియదనీ, ఆంగ్ల సాహిత్యానువాదమైతే బావుంటుందనీ జోష్ అనువాద విభాగం డైరెక్టర్ ఇనాయతుల్లా అనే ఆయనకు చెప్పు కొన్నారు. ఈ అధికారి హైదరీ, రాస్ మసూద్‌లకు కావలసిన వాడు. ఈ ఆగంతకుడిని యిలా అయినా వదలించుకోవచ్చని ఆలోచించి అతడు జోష్‌ను ఫర్మానాకు జవాబుగా ఆ మాటే రాయమన్నాడు.

జోష్ సమాధానం కింద, అతడు ''ఆంగ్ల సాహిత్యం, ఆంగ్లంలోనే బోధించ బడుతూ వుంది కాబట్టి అందుకు అనువాదకుణ్ణి నియమించటంలో సబబు కనిపించడం లేదు'' అని రాసేసి నిజాం దగ్గరకు పట్టుకుపోయాడు.

నిజాం జోష్‌కు ఆంగ్లానువాదకుని ఉద్యోగమే ఖాయంచేస్తూ రెండో ఫర్మానా జారీ చేశాడు, పై పదవి ఏదన్నా ఖాళీవచ్చినప్పుడు జోష్‌ను ఆ పదవిలో నియమించి, ఈ ఆంగ్లానువాదకోద్యోగాన్ని రద్దుచేయాలని ఆదేశించాడు.

---

* హైద్రాబాద్ సంస్థానానికి రాకముందు జోష్‌కు ఒక కల వచ్చిందట. దేవదూత (ఇస్లాం ప్రవక్త మొహమ్మద్) సాక్షాత్కరించి ఆయనకు దక్కన్ పాలకుడైన నిజాంను ఆశ్రయించమని ఆదేశించాడట!

ఉద్యోగంలో చేరిన మరునాడు జోష్ కృతజ్ఞతా సూచకంగా నిజాం దర్శనానికి వెళ్ళారు. తన తరఫునా, తన భార్య తరఫునా, తన పిల్లల తరఫునా మొత్తం మూడు నజరానాలు సమర్పించారు. నిజాం కానుకలు స్వీకరించి, "జోష్, నీ కెంతమందోయ్ పెండ్లాలు....మీ అవధ్ లో ఒక్కొక్క తాలుక్దారుకు చాలమంది పెండ్లాలుంటారట కదూ!' అనడిగాడు. తనకు ఒకే భార్య అనీ, ఆవిడ గుండె జబ్బు మనిషనీ, మరో పెండ్లి చేసుకొంటే ఆవిడ గుండె పగిలి చచ్చిపోతుందని తనకు భయమనీ చెప్పుకొన్నారు.

ఆవిడకు ఎక్కడెక్కడ వైద్యం చేయించావు, ఎంత డబ్బు తగలేశావు చెప్పమని నిజాం అడిగాడు. జోష్ ఎవరో కొందరు వైద్యుల పేర్లు ఏకరువుపెట్టి, పది పదిహేన వేలకు పైగానే ఖర్చయిందనీ, గుణం మాత్రం కనిపించలేదనీ చెప్పారు.

అది విని నిజాం సగర్వంగా యిలా అన్నాడు: "నాకు వైద్యం బాగానే తెలుసు.... కాని ఎవరికీ వైద్యం చేయను. నా వైద్యం ముందు ఈ డాక్టర్లు, వైద్యులు అంతా బలాదూర్'' అంటూ తన గదిలోకి వెళ్ళి ఐదు రూపాయలు తెచ్చి, జవాన్ చేతికిచ్చి ఏవో రెండు మూడు మూలికల పేర్లు చెప్పి, ఈసామియా బజార్‌నుంచి కొనుక్కురమ్మని పంపాడు.

జవాన్ తెచ్చిన మందులను జోష్ కిచ్చి రోజూ పొద్దూ, మాపూ రోగికి వాటిని ఎలా యివ్వాలో వివరించాడు. ఒక్కరోజు మానివేసినా మందు గుణమివ్వదని హెచ్చరించాడు. మృగశిర ప్రవేశించిన రోజున వచ్చి ఆవిడ ఆరోగ్యం ఎలా వుందో తనకు చెప్పమని ఆదేశించాడు........

జోష్ మృగశిర నాడు దర్బార్‌కు హాజరై రెండు అష్రఫీలు ముడుపు చెల్లించారు. మీ ఆవిడకు ఎలా వుందోయ్ అంటూ నిజాం పరామర్శించాడు. జోష్ వచ్చి అబద్ధం ఆడేశారు. తమ ఔషధ సేవతో ఆవిడ జబ్బు మంత్రం వేసినట్లు మాయమైపోయిందని విన్నవించారు. నిజాం ఎగిరి గంతువేసినంత పనిచేసి, జవాన్‌ను పిల్చి నగరంలోని పెద్ద పెద్ద డాక్టర్లను, వైద్యులను ఉన్న పళాన హాజరు పరచమని హుకుమిచ్చాడు.

వాళ్ళంతా పరుగు పరుగున వచ్చి నవాబుకు నజరానాలు చెల్లించుకొన్నారు. నవాబు గారు డాక్టర్లందరినీ, జోష్‌కు ఎడమ ప్రక్కనా, వైద్యులందరినీ ఆయన కుడి ప్రక్కనా నిలబడమన్నాడు. నగర కొత్వాల్ (పోలీస్ కమిష్నర్) రాజా బహద్దూర్ వెంకటరామ రెడ్డి గారిని వాళ్ళకు ఎదురుగా నిలబెట్టాడు.

నవాబు తమకు ఏదో ఒరగబెట్టబోతున్నాడని ఆశతో వచ్చిన డాక్టర్లను, వైద్యులను చూచి అతడు యిలా గర్జించాడు: "ఈయన పేరు జోష్ మలీహాబాదీ. ఈయన తన భార్య రోగానికి పది పదిహేను వేలు మీ మొహాన తగలేశాడట. కాని, ఒక్కళ్ళూ ఆమె రోగం నయం చేయలేకపోయారు. నేను రెండు మూలికలతో యిట్టే నయం చేశాను.... సాలే గాళ్ళలారా (సాలా అంటే బావమరది—చాలా రష్టయిన ఉర్దూ తిట్లలో ఒకటి) మళ్ళీ ఎప్పుడైనా వైద్యం గియిద్యం అని నా ముందు కోతలు కోశారో, మిమ్మల్ని విషయిస్తాను ...మీ....లో రైలు జొరపెట్టేస్తాను. దానిలో కూర్చుని ధక్ ధక్ మంటూ మన్మాడ్ దాకా వెళ్ళిపోతాను" (ఆ రోజుల్లో యిటు మద్రాసు ప్రెసిడెన్సీలోని విజయవాడ నుంచి, అటు బొంబాయి ప్రెసిడెన్సీలోని మన్మాడ్ వరకు నిజాం సంస్థానానికి సొంత రైలు మార్గం వుండేది.)

నిజాం తమను యిన్ని బండబూతులు తిట్టినా, పాపం వాళ్ళు కిమ్మనలేదు, ఖిన్నులై వుండిపోయారు.

(సశేషం)

కథానిక

# న్యాయానికి సంకెళ్ళు

భాగవతుల సాంబమూర్తి

(ఈ కథానిక, అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ 'స్వీయ కథానికా పఠనం' కార్యక్రమంలో చదువబడి, కథానికా కర్మాగారంలో మెరుగులు దిద్దుకొని - మద్రాసు ఆకాశవాణి తెలుగు కార్యక్రమాల్లో ప్రసారం జరిగింది. కథావస్తువుకు ఆధారం, యిటీవల పత్రికల్లో వచ్చిన ఒక వార్త.)

వీధంతా పోగయి వింతగా చూస్తోంది ఆ యింటి వైపు. అపుడే ఉదయిస్తున్న సూర్యుడు కూడా పరిశీలనగా చూడాలన్నట్లు పైపైకి వస్తూన్నాడు. అందరూ చూస్తున్నారే గానీ ఏ ఒక్కరూ అక్కడ, అంత ఉదయాన జరిగిందేమిటో, జరుగుతూన్నదేమిటో జరుగపోయేదేమిటో, ఇరుగూ పొరుగ్గా తమ బాధ్యత లేమిటో గుర్తించే స్థితిలో లేరు. ఏదో జరిగితే చూడాలన్న తపనే అందరి ముఖాల్లోనూ కనిపిస్తూంది. ఏ ఒక్కరూ ముందుకురికి జరుగబోయేదాన్ని వారిద్దామని ఆలోచించడం లేదు. పాపం ఎవరు మాత్రం ఏం చేయగలరు? ఆ ఛాయలకు పోతే ఏమౌతుందో ననే భయం. మరొకరికి అన్యాయం జరిగినా వింత కథలా చెప్పుకోగలరే కానీ, దానికి మూలకారణాన్ని నివారిద్దామనే తలంపు ఎవరిలోనూ కలుగదు.

అసలు దుర్గమ్మకి ఈ గొడవతో సంబంధం లేదు. మిగతా వాళ్ళతోపాటు తనూ వింత చూడవలసిందే. ఎవడో తోటి స్త్రీ శీలాన్ని హరించబోతే వూరుకోలేకపోయింది.

నాలుగిళ్ళలో పాలుపోసుకొని బ్రతుకెళ్ళబోసుకొనే దుర్గమ్మగానీ, కూరలమ్మి నాలుగు రాళ్ళు సంపాదిస్తూ దుర్గమ్మతో జీవనం చేస్తున్న నారయ్యకు గానీ ఆ వీధిలో ఏం జరిగితే వారికేం?

అసలు అంత ధైర్యం దుర్గమ్మ కెలా వచ్చిందో? ఆ రోజు అతడి చేతిలో తళ తళ మెరుస్తూన్న కత్తి ఉన్నది. ఎఱ్ఱపడ్డ అతడి కళ్ళు ఆతను త్రాగుబోతని చెపుతున్నాయి. వీటన్నిటికన్నా అతని కున్న 'రౌడీ రామేశం' అన్న పేరు చాల గొప్పదని ఆ వీధిలో అందరికీ తెలుసు. ఇవేవి ఆ క్షణంలో దుర్గమ్మకు జ్ఞాపకం రాలేదు. ఆమెకేమి కనుపించలేదు. ఆమె చూసింది సూటీగా రామేశం తల మాత్రమే. అడ్డులేని ఆమె ఆవేశం ఆ తలపై నిండు పాలచెంబుతో బాదేలా చేసింది. చిక్కని తెల్ల పాలు తలనుండి జారుతున్నాయి. దుర్గ ఆవేశంలో చెంబుతో విసరిన మరో దెబ్బకి ఆతని తల బ్రద్దలయింది.

అదొక భయంకర దృశ్యం. ఆ క్షణంలో ముడి విడిన జుట్టు గోదావరి వరదలా మీదొచ్చి పడుతున్నా వెనక్కి నెట్టకుండా వీరావేశంతో పాల చెంబుతో మీదకొస్తున్న దుర్గమ్మ నిజంగా అవతారమెత్తిన కాళికాదేవి లాగే వుంది. రామేశం తలనుండి చిక్కని నెత్తురు ఒకప్రక్క, మరొపక్క నుండి తెల్లని పాలు ధారలుగా ప్రవహించాయి. దుర్గ ఆవేశం చల్లారలేదు. పాల చెంబుతో ఆతని ముఖంపై మరోసారి కొట్టింది. ముక్కు బద్దలయింది. రక్తం వరదలైంది. తెలివితప్పి నేలపడి దెబ్బతిన్న పాములా గిలగిలా కొట్టుకొన్నాడు. కొండలా నేలపడివున్న రౌడీ రామేశం గుండెలమీద కాలుపెట్టి చేతిలోని పాల చెంబుతో మళ్ళీ కొట్టింది. అంతే రామేశం కన్ను మూశాడు.

ఉద్రేకంలో ఏం జరిగిందో దుర్గమ్మకు

తెలియదు. ఖరీదయిన పాలోలికి పోయిందీ తెలియదామెకు.

మాలక్ష్మి గుర్తించింది రామేశం పోయాడని. జనం గుర్తించారు రామేశం మరణించాడని. అదే మాటన్నాదు ఎవరో—దుర్గమ్మ గట్టిగా నవ్వి జుట్టు ముడివేసుకొని నేలపడివున్న రామేశం శరీరంమీద తుబుక్కున ఉమ్మేసింది. అసలు దుర్గమ్మకు ఆవేశం రాదు. ఆ మనిషిని చూస్తే అంతటి పట్నేస్తుం దని ఎవరూ అనరు.

ప్రతిరోజూ తెల్లవారుజామున నుదుట పెద్ద ఎఱ్ఱని బొట్టుతో, చేతిలో తళతళ మెరిసే ఇత్తడి చెంబులో నిండుగా పాలు తీసుకొని, ఖంగు ఖంగు మనే కాళ్ళ కడియాల చప్పుడుతో పాలు పోయడానికి ఆ వీధిలోకొచ్చే దుర్గమ్మ చూడ్డానికి, రాత్రంతా పూరు కాపలా కాసి ఉగ్ర రూపాన్నొదిలి శాంతమూర్తి అయిన కనకదుర్గమ్మ తల్లి తిరుగుముఖం పట్టిందా అనిపిస్తుంది. ఎవరైనా తెలిసినవా రెదురయితే అమాయకంగా నిర్మలంగా చిరునవ్వు నవ్వుతుంది.

"ఏం సిన్నన్నా బాగున్నావా? మా మరదలు పురుడోసుకుందా?"

"ఏం మనవడా అమ్మకు జొరం తగ్గిందా."

"ఏం కోడలా అత్తెపు డొస్తుందే"— అంటూ వరసలుకట్టి పలకరిస్తుంది. ఆదరణ, ఆప్యాయత ఎంతటి విజ్ఞులైనా ఆమెవద్ద నేర్చుకోవలసిందే. ఎవరికీ సాయం కావాలన్నా తనకు చాతనయినది చేస్తుంది, ఎవరింట్లో ఏ కష్టమొచ్చినా ఏ శుభకార్యమైనా ఆమె ఉండవలసిందే. ఆ వీధిలో అంతా ఆమెవల్ల ఏదో సహాయం పొందిన వారే.

ఏమైతే మాత్రమేం. పోలీసులకు తెలియజేయక తప్పలేదు వారికి. పోలీసులొచ్చారు. దుర్గమ్మను తీసుకెళ్ళారు.

హత్య జరిగిన రోజు దుర్గమ్మ మామూలుగా ఉదయం వాడకందారులకు పాలు పోయడానికి బయలుదేరింది. మొట్టమొదటగా మహాలక్ష్మమ్మ గారి వాకిట ముందు కొచ్చి 'అమ్మా' అని పిలుపబోయేంతలో మాలక్ష్మి ఒక మగమనిషి చేతిలో పెనుగులాడ్డం కనిపించింది. పరిస్థితి అర్థం చేసుకొందుకు ఆమెకు అరక్షణం పట్టలేదు. ఆడ కూతురికి అన్యాయం చేయవద్దు వదలమని అతణ్ణి వారించింది. మాట్లాడితే చంపుతానని అతడు బెదరించాడు. అంతే దుర్గమ్మ అపర కాళిక అయింది.

అసలు రౌడీ రామేశానికి మహాలక్ష్మిమీద చాల రోజులుగా కళ్ళున్నాయి. కానీ ఎన్నడూ అవకాశం ఆ రోజులా చిక్కలేదు. అవకాశం చిక్కితే ఏదైనా దక్కించుకోవడం రామేశానికి అవలీల. అందులో ఆడదాన్ని లొంగదీయడం మన్నది అతనికి పెద్ద ఘనకార్యమేమీ కాదు. లేకపోతే అతనికి అనవసరంగా 'రౌడీ' అన్న బిరుదు నాపాదించేంత చవటలేం గాదు జనం.

దురదృష్టమంతా మహాలక్ష్మిదే నని చెప్పాలి. ఎందుకంటే రామేశం, మహాలక్ష్మి మొగుడు రంగారావును చూడ్డానికి తరచు వస్తూ పోతూనే ఉంటాడు. రంగారావుకి పేకాటంటే మాలక్ష్మి మీదకన్నా మోజెక్కువ—రంగారావుకు మాత్రమేం ఖర్మ ఏ మొగుడికైనా పేకాడుతున్నంత సేపు పెళ్ళానికి విడాకులిచ్చినట్లే లెఖ్ఖ.

మధ్య తరగతి కుటుంబీకులకు భవనాలు, ప్రత్యేక రూములు ఎక్కడనుంచి వస్తాయి? ఉన్న కాస్తంత యింట్లోనే సర్దుకోవాలి. పాపం రంగారావు సర్దుకుపోతూంటాడు.

హారానికి మూడు నాల్గు రోజులు ఆ యింట్లో పేకాట జరుగుతుంది. ఈ ఆట అయిపో యేంతవరకు వంటయింట్లోనో, లేక పక్కిం ట్లోనో పడివుంటుందామె.

ఆ రోజు శనివారం కావడంతో పేకాడ్డానికి రంగారావింటికి నలుగురూ వచ్చారు. వీళ్ళు రాత్రంతా జాగరం చేస్తారని మాలక్ష్మికి తెలుసు. ఉన్నవి రెండు గదులు. ఒక గది పేకాట పెద్దమనుషులతో నిండిపోతే మరో గది చెంబూ తప్పేలా, వంటా వార్పులకు ఉపయోగించుకోవాలి, గనుక ఆ రాత్రికి మాలక్ష్మి పెరట్లో మంచం వాల్చుకొంది.

రామేశం గూడా ఆరోజు రాత్రి సమావే శాన్ని అలంకరించాడు. రామేశం అంటే ఎవరికీ కిట్టదు. రంగారావుకి యిష్టం లేదు. కానీ రంగారావుకి సర్దుకుపోయే గుణంవుంది. అతనిది ఎంతమంచి హృదయమంటే, ఒకటి రెండుసార్లు మా లక్ష్మితో రామేశం అస భ్యంగా ప్రవర్తించాడని తెలిసినా పట్టించుకో లేదు. కారణం రామేశం పేకాటలో చెల్లించే రుసుము అధికం. అతడు లేకపోతే ఎవరికీ అంతగా లాభాలు కిట్టవు.

రామేశం వస్తూ దారిలో అరబాటిల్ విస్కీ పుచ్చుకొన్నాడు. అరబాటిల్ త్రాగినా మనిషి చెదరడు. అదే అతని గొప్పదనం. ఆ సమయంలోనూ అతనికి ఇస్పేటు అసు ఇస్పేటాసులాగే కన్పిస్తుంది గానీ ఆటీన్‌లా కన్పించదు.

ఆట జోరుగా తెల్లవార్లూ సాగింది. తెల్ల వారుజామున రంగారావు ముక్కలు పంచు తున్నాడు. పదమూడు ముక్కలు తీసుకొన్న రామేశానికి ఆటీన్ రాణి కొదవ కనిపించింది. అందుకే ఆట పారేసి కాస్త గాలి పీల్చుకొం దుకు బయటికొచ్చాడు. తృళ్ళిపడ్డాడు. పద మూడు ముక్కల్లో కనుపించని ఆటీన్ రాణి మంచంమీద పవ్వళించినట్లు కన్పించింది.

మరెవరో కాదు మహాలక్ష్మనని తేల్చు కొన్నాడు. అంతటి మహదవకాశం దక్కి నందుకు తనను తా నభినందించుకున్నాడు. మంచం సమీపించాడు. తెల్లవారుజాము-లేత వెన్నెలలో చల్లటి గాలిలో అదమరచి నిద్ర పోతోంది మహాలక్ష్మి. రామేశం మనసు మొద్దుబారింది. శరీరం గగుర్పొడిచింది. మంచంలో చోటుకోసం మాలక్ష్మిని ప్రక్కకు తోశాడు. మహాలక్ష్మి మేల్కొంది, పరిస్థితి గ్రహించింది. బ్రతిమాలుకొన్నది. అరుస్తానని భయపెట్టింది. పెనుగులాడింది. పారిపోవ ప్రయత్నించింది. కేకవేయ బోయింది. నోరు నొక్కాడు రామేశం. పశు వులా ఆక్రమించ ప్రయత్నించాడు.

పాపం లోపల పేకాడుతూన్న వారికి, మాలక్ష్మి ఆక్రందన వినిపించలేదు. సరిగ్గా ఆ సమయంలోనే పాలుపోయడానికి వచ్చింది దుర్గమ్మ. పరిస్థితిని అర్థంచేసుకొంది. పెద్ద పెట్టున కేకవేసింది.

జనానికి తెల్లవారిందే గానీ అందరికీ వింతగా ఉంది. ఏం జరుగుతుందో నని కిటికీల్లోంచి, వోరవాకిళ్ళలోంచి చూస్తున్నారే తప్ప ఏ ఒక్కరూ ఇదేమిటని అడగలేదు.

అంతమందిలో రామేశానికి పరువు బోవడం ఇష్టంలేదు. అందుకే తను సాధించ దలచింది పొందాలని, నలుగురిలో తన గొప్ప ప్రదర్శించాలని జేబులోని కత్తి తీశాడు. ముందుకొచ్చిన వాళ్ళను హతమా రుస్తా నన్నాడు.

ఏ ఒక్కరూ ముందుకు రాలేదు. రామేశం మహాలక్ష్మిని వదల్లేదు. అంతే దుర్గమ్మ కనకదుర్గమ్మే అయింది. నిండుగావున్న పాల చెంబుతో ముందుకురికింది.

తెల్లబోయి చూస్తున్న ఆ నలుగురు పేకాటరాయుళ్ళ బాధ్యతా రహిత ప్రవర్తనే ఈ హత్యాకాండకు నాంది అని - సమాజం గుర్తించకపోయినా మహాలక్ష్మి గుర్తిం చింది.

చేసింది హత్య గనుక, పోయింది ప్రాణం గనుక దుర్గమ్మను పోలీసులు తీసుకుపోయారు.

# కీ. శే. కొలచల సీతారామయ్య

పదహారణాల ఆంధ్రుడు, సోవియట్ దేశ పౌరుడు........అంతర్జాతీయత, స్వదేశాభిమానం, ప్రగాఢమైన స్వభాషాభిమానం, గొప్ప శాస్త్ర పరిజ్ఞానం,— వీటన్నిటికీ మించిన మానవత, సౌజన్యం మూర్తీభవించిన కొలచల సీతారామయ్య (కాన్‌స్తాంతిన్ సెర్గియెవిచ్ సీతారామయ్య) యిటీవల మాస్కోలో కన్ను మూశారు.

మాస్కో యాత్ర తలపెట్టిన తెలుగు వారు ప్రతి ఒక్కరికీ, అంతకు ముందు అక్కడకు వెళ్ళి వచ్చిన తెలుగు వారు, అక్కడ మన సీ తా రా మ య్యా గా రు న్నా రు.... మీకేమీ యిబ్బంది వుండదు లెమ్మని చెప్పేవారు. మాస్కో వెళ్ళివచ్చిన తెలుగు వారు ప్రతి ఒక్కరూ, మన సీతారామయ్యా గారిని చూచి వచ్చామని, ఎంతో గొప్పగానూ, ఆప్యాయతతోనూ చెప్పుకొనేవారు.

సీతారామయ్యా గారి స్వస్థలం కృష్ణా జిల్లా ఉయ్యూరు. ఉన్నత విద్యాభ్యాసం కోసం ఆయన 1921 లో అమెరికా వెళ్ళారు. అక్కడ పెట్రో రసాయన శాస్త్రం అభ్యసించారు, సోషలిస్టు సిద్ధాంతం వంటబట్టించుకొన్నారు. సోవియట్ రష్యాలో విదేశీ జోక్యమూ, అంతర్యుద్ధమూ ముగిసి దేశ పునర్నిర్మాణం ఆరంభమైనప్పుడు, ప్రపంచంలోని ఆ మొట్టమొదటి సోషలిస్టు రాజ్యం, ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణంలో తనకు సాయం చేయవలసిందిగా ప్రపంచ మేధావులకు విజ్ఞప్తి చేసినప్పుడు, ప్రపంచం నలు మూలల నుంచి అక్కడకు వెళ్ళిన విజ్ఞానశాస్త్ర వేత్తల్లో మన సీతారామయ్యా గారొకరు. ఆయన ఆ దేశానికి వెళ్ళి అక్కడ పెట్రో రసాయన పరిశ్రమాభివృద్ధికి తన శక్తినంతా ధారవోసి కృషి చేశారు.

సోవియట్ దేశానికి కష్టభరితమైన ఆ రోజుల్లో సీతారామయ్యా గారు అక్కడకు వెళ్ళటం, ఆ దేశ ప్రజల కష్ట సుఖాలతో తన జీవితాన్ని ముడిపెట్టుకోవటం, ఆ విప్లవ దేశ పౌరసత్వం స్వీకరించి అక్కడే స్థిరపడేందుకు నిర్ణయించుకోవటం ఆయన త్యాగశీలతకు, సోషలిస్టు వ్యవస్థ విజయం పట్ల గల అచంచల విశ్వాసానికి నిదర్శనం.

మన దేశం పరాయి పాలనలో మగ్గుతున్న రోజుల్లో (1921 లో) విదేశాలకు వెళ్ళిపోయిన సీతారామయ్యా గారు దాదాపు 40 ఏళ్ళ తరువాత, 1963 లో మాత్రమే స్వతంత్ర భారత దేశం గడ్డపై కాలుపెట్టారు.

ఏక బిగిన నాలుగు దశాబ్దాలపాటు పై దేశాల్లో వుండిపోయినా, ఆయన తెలుగు భాష మరచిపోలేదు. తెలుగు సాహిత్యంలోనూ, తెనుగు నాటా, ఎక్కడే మూల ఏమి జరుగుతూవుందో అనుక్షణం అధ్యయనం చేస్తుండేవారు. తేనెలూరే తెలుగు మాట్లాడేవారు. తమ బిడ్డలకు చక్కని తెనుగు పేర్లు పెట్టుకొని, మురిసిపోతూ పిల్చుకొనేవారు. రష్యాలో పలువురికి ఆయన తెలుగు బోధించారు. ఆ దేశంలో సోవియట్ పౌరులకు మొట్టమొదట తెలుగు నేర్పినది ఆయనే. తెలుగు భాషాధ్యయనాన్ని దేశంలో సకల విధాల ప్రోత్సహించారు. ఆంధ్రుల సంక్షిప్త చరిత్రను (ఏటుకూరి బలరామమూర్తి గారు రాసినది) రష్యన్‌లోకి అనువదించి, మన తెనుగు వారి చరిత్రనూ, సంస్కృతినీ, సోవియట్ ప్రజలకు పరిచయం చేశారు.

ప్రప్రథమ సోషలిస్టు దేశ పౌరుడైన, అత్యంత విశిష్టతగల యీ ఆంధ్రుని మరణానికి 'అభ్యుదయ' తన గాఢ సంతాపాన్ని ప్రకటిస్తుంది.

# కీ. శే. ఉదయశంకర్

భారతీయ నృత్య రీతికి ఖండాంతర ఖ్యాతి సంపాదించి పెట్టి, భారతీయ నృత్య కళకు పునరుజ్జీవనం ప్రసాదించిన మహా కళాకారుడు ఉదయశంకర్ సెప్టెంబరు 26 వ తేదీన హృద్రోగంతో కన్నుమూశారు ఆయన మృతితో భారతీయ నృత్యాంబరం నుండి ఒక మహోజ్జ్వల తార రాలిపోయింది. భారతీయ నవ్య నృత్య సంప్రదాయంలో ఒక శకం అంతరించింది.

ఉదయశంకర్ 1900 సంవత్సరంలో ఉదయపూర్‌లో ఒక బెంగాలీ కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి రాజస్థాన్‌లోని ఝూల్వార్ సంస్థానంలో ఒక ఉన్నతోద్యోగి ఉదయశంకర్ చిత్రలేఖనం అభ్యసించడానికి లండన్ వెళ్ళారు విలియం రోతెన్‌స్టీన్ వద్ద చిత్రకళ నభ్యసించే కాలంలోనే ఆయన దృష్టి భారతీయ కళలపై ప్రసరించింది చిత్రకారుడుగా జీవితం ప్రారంభించిన ఉదయశంకర్ నాట్యకారుడుగా రూపొందారు, నృత్యాన్ని తన జీవిత లక్ష్యంగా ఎంచుకున్నారు.

ప్రపంచ ప్రసిద్ధ సోవియట్ నృత్య కళాకారిణి అన్నా పావ్లోవా ఉదయశంకర్ శరీర సౌష్టవాన్ని, పదవిన్యాసాన్ని మెచ్చి తన నృత్య బృందంలోకి తీసుకుంది. పావ్లోవా రాధగా, ఉదయశంకర్ కృష్ణుడిగా ఈ ప్రాచ్య నృత్య రూపకంతో పాశ్చాత్య ప్రపంచాన్ని ఉర్రూత లూగించారు భారతీయ నృత్యకళా పునరుజ్జీవనానికి శ్రీమతి పావ్లోవా, ఉదయశంకర్‌ను ప్రోత్సహించింది

పారిస్‌లో ఒక దశాబ్దం పాటు నృత్య ప్రదర్శన లిచ్చి ఖండాంతర ఖ్యాతి నార్జించిన ఉదయశంకర్ భారత దేశం తిరిగి వచ్చారు. భారతీయ నృత్య రీతులను ఆకళింపు చేసుకుంటూ భారత దేశంలో విస్తారంగా పర్యటించారు. స్వీయ నృత్య బృందాన్ని సమకూర్చుకొని తిరిగి పారిస్ వెళ్ళారు తన నృత్య కళతో పాశ్చాత్య ప్రపంచాన్ని మంత్రముగ్ధులను చేశారు

విదేశాలలో సుప్రతిష్ఠ నార్జించి తిరిగి భారత దేశం వచ్చిన ఉదయశంకర్ ఆల్మోరా పర్వత పంక్తులలో 90 ఎకరాల స్థలంలో నృత్య కళా కేంద్రాన్ని నెలకొల్పారు భరత నాట్యం, కథకళి, మణిపురి మున్నగు నృత్య రీతులలో దిగ్గంతులైన పండితులు ఈ కళా కేంద్రంలో అధ్యాపకులుగా పనిచేశారు సృజనాత్మక కళానిలయంగా వర్ధిల్లిన ఈ కేంద్రం ఐదు సంవత్సరాలలోనే మూతపడింది దీనికి కారణా లనేకం ఉదయశంకర్ చిత్ర నిర్మాణం వైపు దృష్టి సారించి ఈ కేంద్రాన్ని ఉపేక్షించడం కూడా యిందులో ఒక భాగం.

ఉదయశంకర్ నిర్మించిన 'కల్పన' చిత్రం ఆయన సృజనాత్మక ప్రతిభకు నిదర్శనంగా నిలచినా, ఆయనను ఆర్థికంగా దెబ్బ తీసింది. ఈ చిత్ర నిర్మాణ కాలంలోనే (1942) ఆయన తన కళా కేంద్రంలోని విద్యార్థి అమలా శంకర్‌ను వివాహమాడారు

చలనచిత్ర ప్రవేశం ఆయన పతనానికి నాంది అయ్యింది వ్యాపారదృష్టి ఏమాత్రమూ లేని ఆయన కళాదృష్టి ఆయనను ఆర్థికంగా కుంగదీసింది ఆయన కలకత్తాలో స్థిరపడి చిన్న పాఠశాలలో పనిచేయ నారంభించారు సంప్రదాయ నృత్య రీతులను తన స్వీయ సృజనాత్మక స్ఫూర్తితో పరిపుష్టం చేసిన ఉదయశంకర్ సంప్రదాయవాదుల నిందలను సైతం భరించక పోలేదు 'కార్తికేయ', 'ఇంద్ర', 'శివ-పార్వతి' లాంటి పౌరాణిక

నృత్య రూపకాలతోబాటు, సోషలిస్టు భావ సమున్మీలితమైన 'కార్మికుడు - యంత్రం' లాంటి నృత్య రూపకాలను సైతం సృష్టించి సోషలిస్టు భావాలను యెంతటి కళాత్మకంగా చెప్పవచ్చునో ప్రపంచానికి చాటి చూపారు

ఆర్థికంగా దెబ్బ తిన్నా, అనారోగ్యం తనను పీడకున్నా, (ఆయనకు మూడుసార్లు హృద్రోగం, ఒకసారి మెదడులో రక్త నాళాలు చిట్లడం సంభవించింది) ఆయన తన కళా సేవను విస్మరించ లేదు. ఆయన తన 62 వ ఏట కూడా తన బృందంతో అమెరికాలో నృత్య ప్రదర్శన లిచ్చారు.

ఆయన నృత్య ప్రపంచానికి చేసిన సేవలకు గాను భారత ప్రభుత్వం పద్మభూషణ్ బిరుదంతోనూ, విశ్వభారతి 'దేశికోత్తమ' బిరుదంతోనూ సత్కరించింది ప్రపంచ ప్రసిద్ధ సితార్ విద్వాంసుడు పండిత రవి శంకర్ ఆయన సోదరుడు సుప్రసిద్ధ నటి మమతా శంకర్ ఆయన కుమార్తె భారతీయ నృత్య చరిత్రలో తనకొక సువర్ణాధ్యాయాన్ని లిఖించుకొన్న ఆ దేశికోత్తమునికి 'అభ్యుదయ' అంజలి ఘటిస్తుంది

> సంగీతం, చిత్రకళ కవిత్వం వంటివే నని తరచు చెపుతుంటారు కాని దానికి నృత్యంతో ఎక్కువ సాన్నిహిత్యం వుంటుందనిపిస్తోంది నాకు ఎంచేతనంటే, కవిత్వానికి స్వీయ నర్తనం—పద సంబంధమైనది—వుంది; స్వీయ లయ వుంది భారతీయ నృత్యంతో దానికి పోలిక ప్రత్యేకించి దాని కెక్కువగా వుందని నా కనిపిస్తుంది ఆ కళా రూపంలో హావభావ భంగిమలు ఎంతో అర్థాన్ని అంద జేస్తాయి కవిత్వంలో భావ విశదీకరణ నిమిత్తం పదాలు కూర్చడం జరుగుతుంది
>
> ఎ. డి. హోప్ (ఆస్ట్రేలియా కవి)

## లేఖలు

### మొదటి తెలుగు కథ

'అభ్యుదయ' అక్టోబరు సంచికలో తొలి తెలుగు కథానిక అన్న శీర్షిక కింద ఒక వార్త పడింది అది బహుశా మీరు ఒక విజయవాడ దిన పత్రిక నుంచి తీసుకొని ఉంటారను కుంటాను

విశాఖపట్నంలో, విశాఖ సాహితి వారు నిర్వహించిన ఉత్సవాల సందర్భంగా, తెలుగు కథానిక మీద గోష్ఠి జరిగింది శ్రీ పురిపండా అప్పలస్వామి గారు అధ్యక్షులుగాను, నేను సంచాలకుడు గాను వ్యవహరించాం అందులో శ్రీ అప్పలస్వామి గారు మాట్లాడుతూ తెలుగులో తొలి కథానిక రాసింది గురజాడ అప్పారావు గారేనన్న అభిప్రాయం ప్రచారమయిందని, ఆయన కంటె కొన్ని సంవత్సరాల ముందు, ఆచంట వెంకటరాయ సాంఖ్యాయన శర్మ గారు రాసిన కథ 'కల్పలత' పత్రికలో వచ్చిందని అన్నారు తరవాత, సంచాలకుడుగా నేను మాట్లాడుతూ, సాంఖ్యాయన శర్మ గారు రాసిన కథలు నేను చూడలేదనీ, వాటిని ఆధునిక కథానికలుగా పరిగణించ వచ్చునో, లేదో చూస్తేనే కాని చెప్పలేననీ అంటూ, గురజాడ వారు 'దిద్దుబాటు' కథ ('ఆంధ్రభారతి', మచిలీపట్నం,) 1910లో (ఫిబ్రవరి సంచిక) ప్రచురించినప్పటికీ అంతకు పూర్వమే కనీసం రెండు దశాబ్దాలుగా తెలుగులో కథానికా రచనకు రంగం సిద్ధం చేసుకుంటూ వచ్చిన సంగతి వారి డైరీల్లో తెలుస్తుందనీ అన్నాను పైగా, సమకాలిక సామాజిక జీవనంలోని ఒక అంశాన్ని ఎన్నుకొని, ఆధునికమైన భాషలో, ఆధునికమైన శిల్పంతో అక్షరాలా అణిముత్య మన దగ్గ కథ రచించారని చెప్పాను ఒకానొక ప్రక్రియకు శ్రీకారం చుట్టింది ఎవరని నిర్ణయించే సందర్భంలో, కేవలం కాలెండరు తేదీల పూర్వాపరాల్నిబట్టి కాక ఆయా వ్యక్తుల సాహితీ మూర్తి మత్వాన్ని బట్టి కూడా గమనించవలసి ఉంటుందని అన్నాను

మొత్తంమీద, నేను చెప్పింది పురిపండా వారు చెప్పినట్టూ, వారు చెప్పింది నేను చెప్పినట్టూ ప్రచురణ జరిగింది పైగా విచిత్రం— **1910**లో వచ్చిన గురజాడ వారి కథను కాదని **1923** (!)లో వచ్చిన ఆచంట వారి కథే తొలి తెలుగు కథానిక అని నేను అన్నానట!!

**పోరంకి దక్షిణామూర్తి** హైదరాబాద్

* * *

'అభ్యుదయ' అక్టోబరు సంచిక సంగ్రహ వార్తల్లో ప్రచురించినట్టుగా, తెలుగులో తొలి కథానిక రాసింది గురజాడ అప్పారావు గారని నేననలేదు శ్రీ పోరంకి దక్షిణామూర్తి అన్నారు. ఆచంట సాంఖ్యాయన శర్మగారి 'లలిత' తొలి తెలుగు కధానిక అని శ్రీ పోరంకి దక్షిణామూర్తి అనలేదు, నేనన్నాను అధ్యక్షుడు. శ్రీ పోరంకి దక్షిణామూర్తి కాదు, నేను, ఆయన ఆ సభలో సంచాలకుడు.

శ్రీ దక్షిణామూర్తి చిన్నకథ మీద పరిశోధనా వ్యాసం రాసి ఈ మధ్యే డాక్టరు అయారు తమ వ్యాసంలో వారు అప్పారావు గారే తొలి తెలుగు కథానికా రచయిత అని రాశారు. అందుకని వారు నాతో ఏకీభవించ లేదు శ్రీ సాంఖ్యాయన శర్మ కథలు తాను ఎరగనని ఆ సభలో ఆయన చెప్పారు సాంఖ్యాయన శర్మ గారి 'లలిత' విశాఖపట్నం నించి వెలువడుతూ వుండిన 'కల్పలత'లో **1903**లో వెలువడింది అప్పారావుగారి తొలికథ "దిద్దుబాటు" 'ఆంధ్ర భారతి' (మచిలీ పట్నం)లో **1910**లో వచ్చింది. చిన్న కథ లక్షణాలన్నీ దానికి వున్నాయనీ, అప్పారావు గారు రాసినన్ని కథలే ఆయన కంటే ముందు శర్మ గారు రాశారనీ, అంచేత తెలుగులో తొలి చిన్నకథా రచయిత ఆచంట వెంకటరాయ సాంఖ్యాయన శర్మ గారనీ, గురజాడ అప్పారావు గారు కాదనీ నేను చెప్పాను

నేనన్నది పాపం శ్రీ పోరంకి దక్షిణామూర్తికి, ఆయనన్నది నాకూ అంటగట్టిన ఈ పొరపాటు 'అభ్యుదయ'ది కాదు 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్ర ప్రభ', 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'—ఈ మూడిటి లోనూ ఈపొరపాటే పడింది తరవాత ఏ మూలో చిన్న సవరణ పడింది. ఆ మూడిటి మొదటి వార్త 'అభ్యుదయ'ని తప్పు దారి పట్టించింది అంతే కాదు, పై పత్రికల్లో **1903** అనడానికి **1930** అనీ, **1923** అనీ పడింది విశాఖ 'ఈనాడు'లో మాత్రం సరిగా పూర్తి వార్త వచ్చింది

నిజం తారుమారు కాకూడదు కనక ఈ సవరణ 'అభ్యుదయ' ప్రకటిస్తుందని ఆశిస్తాను

**పురిపండా అప్పల స్వామి** విశాఖపట్నం

## సినిమా సమీక్షలు

అక్టోబరు సంచికలో విజయవాడ నుండి "ఒక ప్రేక్షకుడు" వ్రాసిన లేఖ చదివాక మన ప్రేక్షకులు చాల అమాయకులని అర్థమయింది ఒక అర డజనుకు మించని పెద్ద దిన పత్రికలు, ఒక డజనుకు పైగావున్న పెద్ద వార , మాస పత్రికలు యీ లొంగుబాటు తత్వం వదులుకోవడం దుస్సాధ్యమేమీ కాదు అన్నారు "ఒక ప్రేక్షకుడు" మన సినీమాలు, పత్రికలు కూడా వ్యాపార నాగరికతలో భాగమే వ్యాపారం కోసం పత్రికలు నడిపేవారు డబ్బుకి లొంగక చేయగలిగిందేమిటి? ధన ప్రభావానికి లొంగని పత్రిక మన సమాజంలో సహజ మరణం పొందుతుంది ఈ నాడు పత్రికా స్వాతంత్ర్యం, అభిప్రాయ స్వాతంత్ర్యం మొదలైనవి ప్రజల కళ్ళలో దుమ్ముకొట్టి వ్యాపారం చేసుకునేందుకు సాధనాలుగా ఉపయోగపడే కుహనా/నినాదాలు కేవలం ప్రజాబలం మీద ఆధారపడే కొన్ని రాజకీయ పార్టీల పత్రికలూ యీ అబద్ధాల అమ్మకానికి దిగజారుతున్నప్పుడు తక్కిన వ్యాపార పత్రికలకు హితబోధ చేసి ప్రయోజన మేమిటి? గొంగళిలో భోంచేస్తూ వెంట్రుకలు రాకుండా చూసుకునే కంటె గొంగళికి అగ్ని సంస్కారం చేసి పరిశుభ్రమైన విస్తట్లో భోంచెయ్య గలిగినప్పుడు మనం ఆరోగ్యకరమైన ఆహారం తినగలము

**బి కృష్ణవేణి** మద్రాసు

---

**నవంబరు 6 (ఆదివారం) గోష్ఠి**

**కథానికా పఠనం**

స్థలం పొట్టి శ్రీరాములు స్మారక మందిరం

ప్రారంభం సాయంత్రం 6 గంటలకు

అందరికీ స్వాగతం

---

